నోరూరించే... మనసునుదోచే... మైమరపించే.






కొత్త పార్లే

పాపిన్స్

పండ్ల రుచిగల పిప్పరమెంట్లు

5 పండ్ల సువాసనలలో 13 మధురమైన బిళ్ళలు-
తక్కువ వెలగల ముక్కువ గొలిపే ప్రతి ప్యాక్‌లో—
నిమ్మ, మూసంబి, నారింజ, అనాస మరియు రాస్ప్‌బెరీ!

ఆ పండ్ల మజా తెలుసుకోండి పాపిన్స్ నారగించండి-

everest/551b/PP ti



3

# ఈ బాలురలో ఎవరికి తనతల్లి
# ఇన్‌క్రీమిన్* ఇస్తుంది?

నిజమే మీరు కనుగొన్నది!



అపూర్వమైన ఈ టానిక్ వాడాలి
ఆడుతూ పాడుతూ
పెరగాలి

డ్రాప్స్: 2 నెలల నుండి
2. ఏళ్ళ పసిపాపలకు
సిరప్: 14 ఏళ్ళ
లోపు పిల్లలకు

## ఇన్‌క్రిమిన్* టానిక్




**ఇన్‌క్రిమిన్ అధిక ఆహారాన్ని**
**అధిక పెరుగుదలగా మారుస్తుంది**

డాక్టర్లు విశ్వసించే పేరు Lederle
అమెరికన్ సయానమిడ్ వారి విభాగము

* అమెరికన్ సయానమిడ్ కంపెనీ వారి రిజిస్టర్డ్ ట్రేడ్ మార్క్.

SISTA'S/INC/959 TEL



# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళ కథ ["అరినపగ"] కొమ్ముల గణేశ్వరరావు పంపినది. రాజుకూ ప్రజలకూ మధ్య అవగాహన ఉండాలి. లేని పక్షంలో రాజు చేసే మంచి పనులు కూడా ప్రజలకు చెడుగా కనిపించవచ్చు. వారికి స్వార్థం కూడా ఉన్నప్పుడు, రాజు దేశ క్షేమం కోరి చేసే పనులు వారిలో విద్వేషాన్ని రేకెత్తిస్తాయి. కాని వారికి పరిపాలన అర్థమయాక రాజు చర్యలు అర్థమవుతాయి. ఇదే విషయాన్ని ఈ కథలో మనం చూస్తాం.

సంపుటి 52 ఏప్రిల్ '73 సంచిక 4

CHITRA



# అమరవాణి

జీవన గ్రహణే నమ్రాః,
గృహీత్వా పున రున్నతాః;
కిం కనిష్ఠాః, కిము జ్యేష్ఠాః
ఘటీయంత్రస్య దుర్జనాః? 1

[ప్రాణాలు తీసేటప్పుడు అణిగి ఉండి, ప్రాణాలు తీసి పైకి వస్తారు; (ఖాళీగా ఉన్నప్పుడు కిందికిపోయి నీరు తీసుకుని పైకి వచ్చే) ఏతాముకు వీరు తమ్ములా, అన్నలా?]

ముఖం పద్మదళాకారం,
వచ శ్చందన శీతలం,
హృ త్కర్తరిసమం చాతి-
వినయం ధూర్తలక్షణం. 2

[పద్మంలాటి ముఖమూ, చందనంలాటి చల్లని మాటలూ, కత్తెరలాటి మనస్సూ, అతి వినయమూ ధూర్తలక్షణాలు.]

ఉపకారేణ నీచానా
మపకారో హి జాయతే;
పయఃపానం భుజంగానాం
కేవలం విషవర్ధనం. 3

[నీచులకు ఉపకారం చెయ్యటం వల్ల అపకారమే జరుగుతుంది; పాలుతాగటం వల్ల పాములకు విషమే వృద్ధి అవుతుంది.]

---

దుర్మార్గుల స్వభావం

---



# పడవ స్నేహితం

పదకొండువందల ఏళ్ళ క్రితం చీనా మధ్య ప్రాంతంలో చియాంగ్ లింగ్ అనే నగరంలో కువో అనే అపారధనసంపన్నుడు ఉండే వాడు. కువో తండ్రి వర్తకం చేసి కోట్లు గడించాడు. కువో వడ్డీ వ్యాపారం చేసి మరింత ధనవంతుడయాడు. అతని వద్ద పెద్ద పెద్ద వర్తకులే అప్పుచేసేవాళ్ళు.

చాంగ్ అనే వర్తకుడు కువో వద్ద అనేక లక్షలు అప్పుచేసి, దూరాన ఉన్న రాజధానీ నగరానికి వెళ్ళాడు. చాలా ఏళ్ళు గడిచి నప్పటికీ ఆ బాకీ అలాగే ఉండిపోయింది. ఆ బాకీ వసూలు చేసుకోవటానికి కువో రాజధానికి బయలుదేరాడు. బాకీ వసూలుతో బాటు రాజధానీ నగర జీవితం చూడాలన్న ఉబలాటం కూడా అతనికి కలిగింది. అందు చేత కువో తన తల్లినీ, తమ్ముణ్ణీ, చెల్లెలినీ ఇంటి నౌకర్లకు అప్పగించి రాజధానికి తన సొంత పడవ మీద ప్రయాణిస్తూ వెళ్ళాడు.

చాంగ్ జాడ కువోకు సులువుగానే తెలిసింది. ఎందుకంటే, ఆయన రాజధానికి వచ్చి డబ్బూ, పరపతీ గడించి చాలా ప్రసిద్ధుడయాడు. ఆయన కువోకు ఘనంగా స్వాగతమిచ్చి, "నేను నీకు చాలా బాకీ ఉన్నాను. ఆలస్యానికి చాలా, కారణాలు ఉన్నాయి. ఒకటి, నేను చాలా కాలం పాటు ఇక్కడ వర్తకంలో ఊపిరి సలపకుండా మునిగితేలాను. ఆ తరవాత అంత పెద్ద మొత్తం తీసుకుని దూర ప్రయాణం చెయ్యటం ప్రమాదమనిపించింది. ఎవరి కన్నా ఇచ్చి పంపటం అసలే సాధ్యం కాదు. నువే వచ్చావు కనక చాలా మేలయింది. నీ బాకీ అసలు ఫాయిదాలతో సహా ఇప్పుడే లెక్కకట్టి ఇచ్చేస్తాను," అన్నాడు.

కువో తన బాకీ వసూలు చేసుకున్నాడు, కాని వెంటనే ఇంటికి తిరిగిపోక, మహా నగరంలో విలాసాలు అనుభవిస్తూ మూడేళ్లు




గడిపాడు. డబ్బు మంచి నీళ్ళలాగా ఖర్చు పెట్టే వాడి చుట్టూ పనికిమాలిన మూక ఎప్పుడూ చేరుతుంది. కువో చుట్టూ అలాటి మూకే చేరింది. ఆటగత్తెలూ, పాటగత్తెలూ, స్తోత్రపాఠాలు చెప్పే స్నేహితులూ సగం డబ్బు తినేసిన మీదట కువో తన స్వస్థలానికి తిరిగి పోదామనుకున్నాడు.

కాని అందుకు ఒక అవాంతరం వచ్చింది. మధ్య చీనాలో చక్రవర్తి పరిపాలన మీద తిరుగుబాట్లు సాగాయి. ఆ పరిస్థితిలో డబ్బు వెంట పెట్టుకుని ప్రయాణించటం మంచిది కాదని నలుగురూ సలహా ఇచ్చారు. కువో చేసేదిలేక రాజధానిలోనే ఉండిపోవలసి వచ్చింది.

ఇంతలో అతనికి ఒక మంచి వార్త తెలిసింది. అదేమిటంటే, ప్రభుత్వం అధికారాలను డబ్బుకు అమ్మనారంభించింది. తిరుగుబాట్లను అణచటానికి ఎంత డబ్బూ చాలటం లేదు. అందుకని ప్రభుత్వం ఖాళీ పడిన చిన్న పెద్ద పదవులను డబ్బుకు అమ్మేస్తున్నది.

కువో విద్వత్పరీక్షలలో ఉత్తీర్ణుడు కాలేదు. ఆ కారణం చేత ఆ నాటి పరిస్థితిలో చిన్న ప్రభుత్వోద్యోగానికి కూడా పనికిరాడు. కాని డబ్బుతో పదవులు దొరికేటట్టుంటే అతనికి పదవులు నిర్వహించాలన్న బుద్ధిపుట్టింది.

"నా వద్ద ఇరవై, ముప్ఫైలక్షల దాకా ఉన్నది. దానితో ఎలాటి పదవి కొనుక్కోగలను?" అని అతను మిత్రులను అడిగాడు.

"సూటిగా వెళితే ఆ డబ్బుకు పెద్ద పదవి రాదు. ఏ పల్లెటూరులోనో న్యాయాధికారిగా వేస్తారు. కాని ఆ మొత్తం దివాణంలో అధికార్లకు లంచంగా ఇస్తే నగర పాలకుడి పదవి కూడా రావచ్చు," అన్నారు అతన్ని ఆశ్రయించి బతుకుతున్నవాళ్ళు.

నగరపాలకు డనిపించుకుంటే తన జన్మ తరించినట్టేనని కువో అనుకున్నాడు. అయినా అతను చాంగ్‌ను ముందుగా సలహా అడిగాడు.

"బాబూ, నీ వద్ద ఉన్న డబ్బుతో నగర పాలనాధికారి పదవి దొరికేమాట నిజమే. కాని నీకు అది గిట్టుబాటుగా ఉండదు.

నువు అధికారంలో స్థిరపడి, డబ్బు చేసు కోవటం ప్రారంభించే లోగానే ఏదో సాకు పెట్టి నిన్ను పదవి నుంచి తొలగించి, దాన్ని మరొకరికి అమ్మేస్తారు," అన్నాడు చాంగ్.

కువో నవ్వి, "అయ్యా, నాకీ పదవిలో డబ్బు అవసరం లేదు. ఇంటి వద్ద నాకు కట్టుకుపోయినంత డబ్బు ఉన్నది. నేను కీర్తి కోసమే ఈ పదవి కోరుకుంటున్నాను. రెండు నెలలపాటు నగరపాలకుడుగా ఉన్నా నా తరవాత తరాల వాళ్ళకు ఆ కీర్తి దక్కుతుంది," అన్నాడు.

"సరే, నీ యిష్టం," అన్నాడు చాంగ్.

చాంగ్ సహాయంతోనే కువో ఒక మారు మూల రాష్ట్రంలో ఉన్న నగరానికి పాలనాధి కారిగా ఉత్తరువు సంపాదించాడు. ఈగల లాగా అతని చుట్టూ ముసిరే వాళ్ళు అతని గౌరవార్థం అతని చేతనే అంతులేని విందులు చేయించారు. వాటితో కువోకు తల తిరిగిపోయింది. అతనికి అప్పుడే ఉన్నతాధికారి కళ వచ్చేసింది.

కువో తన మిత్రులకందరికీ వీడ్కోలు చెప్పి తన స్వస్థలానికి వచ్చి చూసేసరికి అతనికి గుండె జారిపోయింది. నది ఎప్పటి లాగే ప్రవహిస్తున్నది గాని, దాని ఒడ్డున ఉండవలసిన గ్రామం లేదు. అక్కడ రాళ్ల గుట్టలున్నాయి. తిరుగుబాటుదార్లు ఇళ్ళన్నిటినీ ధ్వంసం చేసేశారు. వాళ్ళు ఊరంతా కొల్లగొట్టి, ఇళ్ళన్నీ పడగొట్టి, చంపిన వాళ్లను చంపి, దొరికిన వాళ్ళను బానిసలుగా పట్టుకు పోయారు. చాలామంది పారిపోయారు.



కువో తన ఇల్లుండిన ప్రదేశాన్ని పోల్చుకోలేకపోయాడు. తిరుగుబాటుదార్లు తన తమ్ముణ్ణి చంపారనీ, తన చెల్లెలిని ఎత్తుకుపోయారనీ తెలిసింది. ఆ పిల్ల గతి ఏమయిందీ తెలియరాలేదు. అతని ముసలి తల్లి దూరంగా ఒక గుడిసెలో కుండపెంకులతో కాలం వెళ్ళబుచ్చుతున్నట్టు విని, కువో అక్కడికి వెళ్ళాడు.

కొడుకును చూడగానే ముసలి తల్లి బావురుమన్నది. "నువు రావటం ఇంకా కొంచెం ఆలస్యమైతే నేను ప్రాణాలతో కనిపించేదాన్ని కాదు, నాయనా!" అన్నదామె.

"మన కష్టాలు తీరాయమ్మా! జరిగినదేదో జరిగింది. నేను నగరపాలకుడి పదవి సంపాదించాను. మనం అక్కడికే వెళ్ళి సుఖంగా బతుకుదాం," అన్నాడు కువో, తల్లిని ఓదార్చుతూ.

ఈ మాటతో ముసలిదానికి ప్రాణం తిరిగి వచ్చినట్టయింది. కువో పదవీస్వీకారం చేసే లోపల పెళ్ళి చేసుకుందామనుకున్నాడు. కాని ఊరు నాశనం కావటంతో ఆ అవకాశం పోయింది.

తల్లి కొడుకులు పడవలో ప్రయాణమై యుంగ్‌చౌ నగరం చేరారు. అక్కడ నది ఉత్తర తీరాన బౌద్ధులకు చెందిన తుషిత మఠం ఒకటి ఉన్నది. ఆ మఠంలోని సన్యాసులు ఉన్నతాధికారి వచ్చినట్టు విని, స్వాగతమివ్వటానికి వచ్చారు.

కువో ప్రయాణిస్తున్న పడవను ఒడ్డున ఉన్న ఒక బ్రహ్మాండమైన మర్రిచెట్టుకు



కట్టి, ఆ రాత్రి తల్లి కొడుకులు ఆ పడవ లోనే నిద్రపోయారు. ఆ రాత్రి బ్రహ్మాండమైన తుపాను వచ్చింది. ఆ గాలికి ఆ పురాతనమైన మర్రిచెట్టు పడవ మీద విరుచుకు పడిపోయింది. పడవ పైభాగం తునాతునకలై పోయింది.

కువోకు నావిక విద్యలన్నీ తెలుసును. అతను తన తల్లిని పడవ నుంచి రక్షించి, మఠం వద్దకు తీసుకుపోయాడు. కాని రాత్రి వేళ మఠద్వారం మూసి ఉన్నది. తలుపు ఎంత తట్టినా ప్రయోజనం లేకపోయింది. తల్లి కొడుకులు తెల్లవార్లూ వానకు తడుస్తూ ద్వారం వద్దనే ఉండిపోయారు.

తెల్లవారి మఠం తెరిచారు. కువో తన తల్లితో సహా లోపలికి రాగానే మఠాధిపతి వారిద్దరినీ చూసి, "దొంగలు దోచుకోలేదు గద!" అన్నాడు. కువో ఆయనకు పడవ ప్రమాదం మాట చెప్పాడు.

మఠాధిపతి ఆ తల్లి కొడుకులకు ఒక గది చూపించి, కువో కోరిన మీదట అక్కడి నగరపాలకుడికి మనిషి ద్వారా కబురు పంపాడు. కాని కువో తల్లి జబ్బుపడి, రెండు రోజుల అనంతరం మరణించింది.

అక్కడి నగరపాలకుడు కువోకు అన్ని విధాలా సహాయపడి, కువో తల్లికి ఘనంగా ఉత్తరక్రియలు జరిగేటట్టు చూశాడు.

కాని ఇప్పుడు మరొక కొత్త బెడద వచ్చి పడింది. చీనా వారి ఆచారం ప్రకారం తల్లిని పోగొట్టుకున్న వాడు మూడేళ్ళ పాటు మైల పట్టాలి. ఈ మూడేళ్ళూ అతను పదవి



స్వీకరించటానికి లేదు. అతనికి హోదా ఏమీ లేదనీ, డబ్బు కూడా ఏమీ లేదనీ, అతని కున్నదంతా అధికార పత్రాలతో సహా నది పాలయిందనీ తెలిసి బౌద్ధసన్యాసులు అతన్ని గౌరవించటం మానేసి, మఠం నుంచి వెళ్ళగొట్టారు.

అతను యుంగ్‌చె రేవు అధికారి ఇంట తలదాచుకోవలసి వచ్చింది. అతన్ని పోషించటం రేవులోని నావికులకు ఏమాత్రమూ ఇష్టం లేకపోయింది.

"నేను నగర పాలకుడు కాబోయేవాణ్ణి. మీరు నన్ను గౌరవించాలి, అమర్యాదగా చూడటం భావ్యం కాదు," అని కువో నావికులతో అన్నాడు.

"చక్రవర్తులైతేమటుకేం? పదవి లేని వాడికి తిండి పుట్టదు," అన్నారు వాళ్ళు.

బతకటం దుస్సాధ్యమై కువో అక్కడి నగర పాలకుడి వద్దకు వెళ్ళి సహాయం అడిగాడు.

"నేను నీ పరిస్థితి చూసి జాలిపడి ఒక సారి సహాయం చేశాను. నువు నగరపాలకుడుగా నియోగించబడ్డట్టు నా కేమిటి నమ్మకం? నీ అధికార పత్రాలేవి? నన్ను ఇలా పీడిస్తే చావగొట్టిస్తాను. వెళ్ళు," అన్నాడు నగరపాలకుడు.

కువో రేవు అధికారి దగ్గిరికి తిరిగి వచ్చి, "నాకు బతుకుతెరువు ఏమిటి?" అని ఏడ్చాడు.

"నువు ఏం చెయ్యగలవు? ఏది చెయ్యగలిగితే అదే బతుకుతెరువు," అన్నాడు రేవు అధికారి.

"నాకు పడవలు నడపటం తప్ప ఏమీ చేత కాదు," అన్నాడు కువో.

రేవు అధికారి అతనికి పడవలు నడిపే పని ఇచ్చాడు. కొంతకాలానికి మూడేళ్ళ మైల ముగిసింది. ఈ లోపల కువోకు నావికుడి వాలకం వచ్చేసింది. అతను నగర పాలకుడి పదవి స్వీకరించటానికి వెళ్ళాలని ప్రయత్నించలేదు. అతనికి పదవీ వ్యామోహం పూర్తిగా పోయింది. నావికుడి జీవితమే అతనికి అన్నివిధాలా సుఖవంతంగా తోచింది.





# యక్షపర్వతం

## 11

[కొండప్రాంతాన్ని చేరిన ఖడ్గ జీవదత్తులకు, బందిపోటు వాళ్ళ వెంటవున్న స్వర్ణాచారి కనిపించాడు. అతడి వెంట వాళ్ళు కొండపైకి పోయారు. ఆ సమయంలో ఒక బందిపోటు వాడు వాళ్ళ దగ్గిరకు పరిగెత్తుకుంటూ వచ్చి, అరణ్యంలో వేటకుపోయిన వాళ్ళనాయకుడు సమరబాహుణ్ణి నరమాంసభక్షకులు పట్టుకున్నారని చెప్పాడు. తరవాత—]

బందిపోటు వాడు చెప్పిన మాటలు వింటూంటే, ఖడ్గ జీవదత్తులకు ఎక్కడలేని ఆశ్చర్యం కలిగింది. ఇన్ని రోజులుగా వాళ్ళు అరణ్యాల్లో ఎంతో దూరం ప్రయాణించారుగాని, ఎక్కడా వాళ్ళకు నరమాంసభక్షకులు తారసపడలేదు.

జీవదత్తుడు ఒక క్షణకాలం వూరుకుని బందిపోటువాడితో, "మీ నాయకుణ్ణి వాళ్ళు కాల్చుకు తింటారో లేక పచ్చి పచ్చిగానే తినేస్తారో అదంతా తరవాత చూద్దాం. నువ్వు ముందు కాలయాపన చెయ్యకుండా జరిగిందేమిటో చెప్పు!" అన్నాడు.

"అయ్యా, మేం పెందరాళే అరణ్యానికి వేటకు పోయి, అదృష్టం కొద్దీ ఒక లేడి దొరకగా దాన్ని చంపి ఇళ్ళకు తిరిగి వస్తున్నాం. దారిలో ఒక చోట పులి గాండ్రింపూ, ఒక మనిషి కేకపెట్టిన ధ్వనీ వినిపించింది. మేము ముగ్గురం అటుకేసి




వెళ్ళాం. ఒక చోట ఒక ఆదిమవాసుడూ, పులీ కనిపించినై. ఆదిమవాసుడు పులి కాళ్ళ కింద చచ్చిపడి వున్నాడు. పులి గుండెల్లో వాడు గుచ్చిన ఈటె వున్నది. పులీ చచ్చిందన్నమాట! కాని సమీపంలో ఒక పులిపిల్ల గోలగా అరుస్తూ తిరుగుతున్నది," అన్నాడు బందిపోటువాడు.

"బహుశా, అది ఆ చచ్చినపులి పిల్ల అయి వుంటుంది! ఆ తరవాత ఏం జరిగింది?" అన్నాడు జీవదత్తుడు.

"మా నాయకుడు ఆ పులిపిల్లను తీసుకుపోయి పెంచుదాం అన్నాడు. నేను నక్కుతూ పోయి దాన్ని పట్టుకున్నాను. ఇంతలో పదీ పన్నెండు మంది ఎలుగుబంటి చర్మాలు ధరించిన వాళ్ళు చెట్ల చాటునుంచి హఠాత్తుగా వచ్చి మీద పడి మనుష్యుల్ని పట్టుకున్నారు. వాళ్ళ నాయకుడు మాత్రం ముఖం కనిపించకుండా ఒక ఎలుగుబంటి తల తగిలించుకుని వున్నాడు. వాడు నన్ను చూసి తన అనుచరులతో, 'ఒరే, వీడు పులిపిల్లను చాలా ఒడుపుగా పట్టాడు, తెలివీ, సాహసం వున్న వాడిలా కనిపిస్తున్నాడు. మనలో కలుపుకుందాం, ఎలుగు చర్మాలు కట్టండి!' అన్నాడు. ఆ వెంటనే వాడి అనుచరులిద్దరు నాకు ఎలుగుచర్మాలు కట్టారు. మా నాయకుడికీ, దొరికిన నా తోటి వాడికీ మాత్రం చేతులకు తాళ్ళుకట్టి, నన్ను పులిపిల్లతో వెంటరమ్మన్నారు. నేను...."

బందిపోటువాడి మాటలకు అడ్డొస్తూ జీవదత్తుడు, "నువ్వు అదృష్టవంతుడివిరా! పారిపోకుండా వాళ్ళతోనే వున్నట్టయితే, ఏదో ఒకనాడు ఆ ఆదిమవాసులకు నాయకుడివయేవాడివి!" అన్నాడు.

ఆ మాటలకు ఖడ్గవర్మతోపాటు, స్వర్ణాచారీ పక్కనవున్న వాళ్ళూ—అంతా పెద్దగా నవ్వారు. బందిపోటువాడు కూడా చిరునవ్వు నవ్వి, "కొంతదూరం పోయింతరవాత నా చేతుల్లో వున్న పులిపిల్లను ఎలుగుబంటితల పెట్టుకున్న వాడి మీదికి విసిరివేశాను. అది వాడి భుజాల మీద పడుతూనే, వాడి గొంతు పట్టుకున్నది. వాడు

దానితో పెనుగులాడే సమయాన, సహాయం కోసం వాడి మిత్రులంతా వాడి దగ్గిరకు పోయారు. నేను అదే అదననుకుని యిక్కడికి పారిపోయి వచ్చాను,'' అన్నాడు.

''ఘనకార్యమే చేశావ్! స్వర్ణాచారీ, మనం ఆ ఆదిమవాసుల స్థావరానికి పోయి, బంది పోట్ల నాయకుడు సమరబాహును బంధ విముక్తుణ్ణి చేద్దామంటావా?'' అని అడిగాడు జీవదత్తుడు.

స్వర్ణాచారి జవాబివ్వబోయేంతలో, అప్పటివరకూ ఒక ఎత్తయిన రాతి మీద నిలబడి అరణ్యం కేసి చూస్తూన్న బంది పోటు వాడొకడు, రాతి మీది నుంచి ఎగిరి కిందికి దూకి, ఖడ్గ జీవదత్తులున్న చోటుకు పరిగెత్తుకుంటూ వచ్చి, ''అయ్యా, మన కొండ కింది అరణ్యంలో చాలామంది ఆదిమ వాసులు డప్పులూ, తప్పెట్లూ వాయిస్తూ, ఎలుగుబంట్లతో నాట్యం చేయిస్తూ వస్తున్నారు,'' అని చెప్పాడు.

''మనకేసి వస్తున్నారా లేక అరణ్యంలో వాళ్ళ దారిన వాళ్ళు పోతున్నారా?'' అంటూ ఖడ్గ జీవదత్తులు వెళ్ళి అరణ్యం కేసి చూశారు.

బందిపోటువాడు చెప్పినదాంట్లో అబద్ధం ఏమీలేదు. తప్పెట్లూ, డప్పులూ మోగిస్తూ, పెంపుడు ఎలుగుబంట్లతో పాటు తామూ చిందులువేస్తూ అరణ్యానికి అడ్డం పడిపోతున్న ఆదిమవాసులు పదీ పన్నెండు మంది కన్న ఎక్కువలేరు. వాళ్ళకు ముందుగా బందీ అయిన సమరబాహుణ్ణీ, అతడి అను





చరుస్తో ఒక ఆదిమవాసుడు తాడుకట్టి తీసుకుపోతున్నాడు.

"ఖడ్గా, ఈ ఆదిమవాసులు మనం వున్న కొండ కేసికాక, అరణ్యంలో ఎక్కడోవున్న వాళ్ళ స్థావరానికేసి పోతున్నట్టున్నది. వీళ్ళు నరభక్షకులైతే మాత్రం సమర బాహును మనం రక్షించలేం," అన్నాడు జీవదత్తుడు.

స్వర్ణాచారి అక్కడికి వచ్చి తలవంచి కొండ దిగువనున్న అరణ్యంకేసి చూసి, ఆదిమవాసుల్నీ, వాళ్ళవెంట బందీగావున్న సమరబాహుస్నీ గుర్తించి ఆదుర్దాగా, "ఖడ్గ జీవదత్త ప్రభువుల్లారా! మీరు ఎలా అయినా సమరబాహుణ్ణి ఆ దుర్మార్గుల బారినుంచి కాపాడాలి. ఎలుగుబంట్లతో నాట్యం చేయిస్తూ, తాము వాటితోపాటు గెంతుతూ అరణ్యాల్లో తిరిగే యీ భయంకరుల చేతుల్లో అతడు ఎంతోకాలం జీవించి వుండటం కష్టం," అన్నాడు.

"స్వర్ణాచారీ, నువ్వు కోరుతున్నావు గనక, మేం సమరబాహుణ్ణి రక్షించే ప్రయత్నంచేస్తాం. మేము ఆ ఆదిమవాసుల్ని వెంబడించిపోయి అతణ్ణి విడిపించటానికి కొంతకాలం పట్టుతుందిగదా. ఈ లోపలే వాళ్ళు అతణ్ణి చంపటం జరిగితే, అది మీ నాయకుడి ఆయుష్కాలం తీరినందున జరిగిన దైవసంఘటనగా భావించాలి," అన్నాడు జీవదత్తుడు.

"ప్రభువుల్లారా! అందుకే ఆలశ్యం కాకుండా సమరబాహుడి అనుచరు లందర్నీ మీకు సాయంగా పంపుతాను. మీరు ఆ క్రూరుల్ని యిక్కడే పట్టుకుని సంహరించి, సమరబాహుణ్ణి బంధవిముక్తుణ్ణి చేయండి," అన్నాడు స్వర్ణాచారి.

స్వర్ణాచారి ముందు వెనుకలు ఆలోచించకుండా ఉద్రేకపడిపోతూ అన్నమాటలకు జీవదత్తుడు నవ్వి, "స్వర్ణాచారీ, నువ్వనే ఆ క్రూరుల్ని అంత తేలిగ్గా సంహరించటం సాధ్యం అవుతుందనుకోకు. మనం దాడి కొచ్చాం అని తెలియగానే వాళ్ళు పారిపోవచ్చు లేకపోతే సమరబాహును

అక్కడికక్కడే చంపినా చంపవచ్చు.... ఎందుకీ అనవసర కాలయాపన! మేము యిప్పుడే బయలుదేరి పోతున్నాం," అన్నాడు.

ఆ తరవాత ఖడ్గ జీవదత్తులు కొండ దిగి అరణ్యంలో ప్రవేశించారు. వాళ్ళకు ముందు పోతున్న ఆదిమవాసులు కంటికి కనిపించక పోయినా, వాళ్ళు తప్పెట్లూ, కొమ్ముబూరలూ ఊదుతూ చేస్తున్న గోల మాత్రం వినిపిస్తూనే వున్నది.

ఒక పావు గంటకాలం ఖడ్గ జీవదత్తులు సాధ్యమైనంత వేగంగా నడుస్తూ, ఆదిమ వాసులను కలుసుకుని, హఠాత్తుగా వాళ్ళను వెనకనుంచి బాణాలతో కొట్టి చెల్లాచెదురు చేయాలని ప్రయత్నించారు. కాని, వాళ్ళు అరణ్యవృక్షాల చాటున యిప్పుడు కనబడి, అంతలోనే కనబకుండా మాయంకాసాగారు.

"ఖడ్గా, మనం యీ ఎలుగుబంటి చర్మాలవాళ్ళను వాళ్ళ నివాసస్థానంలోనే పట్టుకుని హతమార్చవలసిందే తప్ప మరో మార్గం లేనట్టున్నది. ఈ కీకారణ్యంలో మనం వాళ్ళను త్వరగాపోయి కలుసు కోవటం ఎట్లా?" అన్నాడు జీవదత్తుడు నిరుత్సాహంగా.

ఖడ్గవర్మ ఏదో జవాబివ్వబోయేంతలో, అంతవరకూ దూరంగా వినబడుతున్న తప్పెట్లూ, డప్పులమోతలూ హఠాత్తుగా ఆగి



పోయినై. అరణ్య ప్రాంతమంతా ఒక్క సారిగా నిశ్శబ్దమైపోయింది.

"ఖడ్గా, ఏం జరిగివుంటుంది? ఆదిమ వాసులందర్నీ ఒక్కసారిగా ఏ రాక్షసుడో పట్టుకుని మింగలేదుగదా!" అన్నాడు జీవ దత్తుడు ఆశ్చర్యపడుతూ.

"ఇదేదో వింతగానే వుంది! ఇప్పటి వరకూ మనం వాళ్ళుచేసే ధ్వనుల్నిబట్టి, ఎటుపోతున్నారో ఊహించి వెంబడిస్తున్నాం. ఇప్పుడిక వాళ్ళను వెతికిపట్టుకోవటం ఎలా?" అన్నాడు ఖడ్గవర్మ.

అంతలో దాపులనున్న చెట్ల వెనకనుంచి ఒకేసారి రెండు మూడు తోడేళ్ళు అరిచిన శబ్దం వినిపించింది. ఆ అరుపులు వింటూనే



జీవదత్తుడు, "ఇదీ వింతగానే వుంది! పట్టపగలు మనుషులు సంచరించే యీ ప్రాంతాలలో తోడేళ్ళుకూయటమా! అందుకేదో కారణం వుండివుంటుంది. పద చూద్దాం!" అంటూ గుబురు చెట్ల కేసి దారితీశాడు.

ఖడ్గ జీవదత్తులు చెట్లను సమీపించి, నేలబారుగా వున్న వాటి కొమ్మలచాటున నిలబడి ముందుకు చూశారు. అక్కడ చాలా విశాలమైన పంటపొలం ఒకటి కనిపించింది. అందులో కొంత భాగాన రకరకాల కూరగాయల మొక్కలు ఏపుగా పెరిగివున్నవి. మిగిలిన ప్రదేశం అంతా ఫలవృక్షాలతో కంటికి యింపుగా కనబడుతున్నది. కాని ఖడ్గజీవదత్తుల దృష్టిని మాత్రం యివేమీ అంతగా ఆకర్షించలేదు. వాళ్ళు అక్కడ పళ్ళచెట్లకూ, కూరపాదులకూ నీళ్ళుతెచ్చి పోస్తున్న నలుగురు అనాగరిక మనుషుల్నీ, చెట్లకింద తోడేళ్ళను పెట్టుకుని కూర్చునివున్న ఇద్దరు ఎలుగుబంటి చర్మాలు ధరించిన వాళ్ళనూ చూసి చాలా వింతపడ్డారు. తోడేళ్ళ అరుపులకు కారణం ఏమిటో వాళ్ళకు యిప్పుడు అర్థమైపోయింది.

"ఖడ్గా, ఈ ఎలుగుబంటు జనం యిక్కడ అరణ్యంలో కొంతభూమి దున్ని వ్యవసాయం చేస్తున్నారు. వాళ్ళు పని చేయిస్తున్న మనుషులు మరొక జాతివాళ్ళలా కనిపిస్తున్నారు. వాళ్ళు వీళ్ళకు బానిసలైవుంటారు," అన్నాడు జీవదత్తుడు.

"అందులో సందేహంలేదు. ఆ బానిసలు పారిపోకుండా కాపలాకే యీ తోడేళ్ళను వీళ్ళు ఉపయోగిస్తున్నట్టున్నది. పానకంలో పుడకలాగా వీళ్ళు మనకు అడ్డపడ్డారేం? సమరబాహును బంధించిన ముఠా అయిపూ అజాలేకుండా పోయింది," అన్నాడు ఖడ్గవర్మ.

ఖడ్గ జీవదత్తులు యిలా మాట్లాడుకుంటున్నంతలో కూరపాదులకు నీళ్ళు తెస్తున్న బానిస ఒకడు అటూయిటూ తలతిప్పి చూస్తూ, పాదుల వెనగ్గా నక్కినడుస్తూ ఒక చెట్టు కింద కూర్చుని కునికిపాట్లుపడుతున్న

ఎలుగుబంటి చర్మాలవాణ్ణి సమీపించ సాగాడు. వాడు నడుస్తున్నతీరు ఖడ్గ జీవ దత్తులకు చాలా అనుమానం కలిగించింది.

"ఖడ్గా, ఆ బానిసవాడు, ఎలుగుబంటు మనిషిని హతమార్చే ప్రయత్నమేదో చేస్తు న్నట్టు కనబడుతున్నది. అరెరె! వాడు ..." అంటూ ఆగిపోయాడు జీవదత్తుడు.

బానిసవాడు, తనకు కాపలావున్న ఎలుగుబంటి వాడి వెనక్కుపోయి నీళ్ళ కుండలో నుంచి చప్పున ఒక పెద్ద రాయిని బయిటికి తీసి, దానితో కాపలావాడి తలమీద గట్టిగా ఒక బాదుబాదాడు. దెబ్బతింటూనే కాపలావాడు ఒక కేకపెట్టి ముందుకు పడి పోయాడు. అదే సమయంలో బానిసవాడు పరిగెత్తి, అరణ్యంలో ప్రవేశించాడు.

తనతోటి కాపలావాడు పెట్టిన చావుకేక వింటూనే, వాడి అనుచరుడు అటుకేసి చూసి జరిగినదేమిటో గ్రహించి పారిపోతున్న బానిసవాడి మీదికి పెంపుడు తోడేళ్ళను ఉసికొల్పాడు. తోడేళ్ళు రెండూ భయం కరంగా అరుస్తూ, బానిసవాడు పారిపోయిన వైపుకు పరిగెత్తినై. వాటి వెనగ్గా ఎలుగు బంటివాడు కేకలుపెడుతూ అరణ్య వృక్షాల్లోకి పోయాడు.

"ఖడ్గా, సమరబాహు అదృష్టంకొద్దీ మనం యిక్కడికి రావటం జరిగింది. పారిపో కుండా యిక్కడవున్న యీ ముగ్గురు బాని సల్ని అడిగిచూస్తే, ఎలుగుబంటివాళ్ళ నివాసస్థానం మనకు తెలిసిపోతుంది," అంటూ జీవదత్తుడు చెట్లచాటు నుంచి



బయిటికివచ్చి, కూరపాదుల మధ్య నిల బడి దిక్కులు చూస్తున్న వాళ్ళను కేక వేసి పిలిచాడు.

ఆ కేక వింటూనే బానిసవాళ్ళు అదిరి పడి జీవదత్తుడి కేసి చూశారు. పక్కనేవున్న ఖడ్గవర్మ వాళ్ళను దగ్గిరకు రమ్మన్నట్టుగా చేయెత్తి సౌంజ్ఞచేశాడు. ఆ మరుక్షణం బానిసలు ముగ్గురూ కూడబలుక్కున్నట్టు చప్పున వెనుదిరిగి అరణ్యంలోకి పరిగెత్తారు.

జీవదత్తుడు పెద్దగా నవ్వుతూ, "ఖడ్గా, మనం దారితప్పి మతిమాలిన మనుషుల మధ్యకు వచ్చినట్టుంది. తమను కాపలా కాసేవాడు పారిపోతున్న బానిసవాడి వెంట అరణ్యంలోకి పోయినా, యింకా యీ ముగ్గురు బానిసలూ ఏం జరగనట్టు కూర పాదులకు నీళ్ళు పోస్తూనే వున్నారు. కాని, మనను చూస్తూనే దయ్యాల్ని చూసినట్టు పారిపోయారు!" అన్నాడు.

"ఇప్పుడు మనం ఏంచేసేట్టు? పారి పోయిన బానిసవాడి వెంటపడిన పెంపుడు తోడేళ్ళ అరుపులు వినబడుతున్నవా? పద, అరణ్యంలోకి పోతే, సమరబాహుణ్ణి పట్టుకు పోతున్న ఎలుగుబంటు ముఠా కనబడు తుందేమో!" అన్నాడు ఖడ్గవర్మ.

ఖడ్గ జీవదత్తులు తిరిగి అరణ్యంలోకి వచ్చారు. వాళ్ళు తోడేళ్ళ అరుపులు విన బడుతున్న వైపుకు బయలుదేరి కొంత దూరం వెళ్ళేసరికి, హఠాత్తుగా తప్పెట్లూ, డప్పులూ ఒక్కసారిగా మోగిన ధ్వని విన బడింది. ఖడ్గ జీవదత్తులు ఆ ధ్వనులు వచ్చిన వైపుకు తలలు తిప్పిచూశారు. దూరంగా చెట్ల చాటునుంచి నల్లనిపొగ లేచి, ఆకాశం మీదికి ఎగబాకుతున్నది.

"ఖడ్గా, ఆ పొగకు, ఎలుగుబంటు ముఠావాళ్ళు, సమరబాహుణ్ణి కాల్చుకు తినేందుకు వెలిగించిన మంట కారణం కాదుగదా?" అన్నాడు జీవదత్తుడు.

"అంతే కావచ్చు! త్వరగా అక్కడికి పోవటం మంచిది," అంటూ ఖడ్గవర్మ కత్తిదూశాడు. ఆ వెంటనే వాళ్ళిద్దరూ పొగ లేస్తున్న ప్రదేశంకేసి, అరణ్యానికి అడ్డంపడి పరిగెత్తసాగారు. —(ఇంకావుంది.)





# ఆరిన పగ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు ఎవరి కోసం ఈ అపరాత్రి వేళ ఇలా శ్రమపడుతున్నావో తెలియదు. కాని ఈ లోకంలో ఏ కారణమూ లేకుండానే మిత్రులు శత్రులవుతారు, శత్రులు మిత్రులవుతారు. దానికి తార్కాణంగా నీకు భీముడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

విక్రమపురాన్ని పరిపాలించిన విక్రమవర్మ రాజ్యపాలనలో అత్యంత సమర్థుడు. ప్రజలను అతను ఎంత బాగా కనిపెట్టి ఉండే వాడంటే, ప్రజలకు అతని మీద అంతులేని విశ్వాసం, ఎక్కడలేని భక్తి ఉండేది. అతని ఆజ్ఞ అయితే చాలు వాళ్ళు

## బేతాళ కథలు



నిప్పులో దూకటానికి కూడా సిద్ధంగా ఉండేవారు.

ఇది చూసి పొరుగు రాజు, దేవరాజు అనేవాడు, ఏ మాత్రమూ సహించలేక పోయాడు. దేవరాజు ఏలే దేశంలో దేవ రాజును గురించి చెప్పుకునే వారులేరు, కాని విక్రమవర్మను గురించి చెప్పుకునే వారు చాలామంది ఉన్నారు. దేవరాజు పాలనలో అన్నీ ఈతి బాధలే. అతను విక్రమపురాన్ని యుద్ధంలో జయించ లేడు. విక్రమపురంలో అరాజకం పెచ్చరిల్లితేనే గాని యుద్ధంలో అది ఓడిపోదు.

అందుకని దేవరాజు బాగా ఆలోచించి ఒక ఎత్తు వేశాడు.

రెండు రాజ్యాలకూ మధ్య ఉండే అర ణ్యాలలో ఆటవికుల ముఠాలు అనేకం ఉండేవి. ఆ ముఠాలవాళ్ళు అరణ్యం మీదనే అన్నిటికీ ఆధారపడి, ప్రశాంతంగా జీవిస్తూ ఉండేవారు. దేవరాజు అర ణ్యంలో నివసించే ముఠాల నాయకులను రహస్యంగా రప్పించి, "అరణ్యమృగాల కన్న హీనంగా బతుకుతున్నారు మీరు. మిమ్మల్ని చూస్తే జాలివేస్తున్నది. అవతల విక్రమపురం భూలోక స్వర్గం లాగున్నది. అక్కడి సంపదను కొల్లగొట్టితే మిమ్మల్ని అడ్డేదెవరు? అంతగా విక్రమవర్మ మీ మీదికి దళాలను పంపితే మా సరిహద్దులోకి పారి పోయి రండి. నేను మీకు ఆశ్రయం ఇస్తాను. మీ పరాక్రమాన్ని వినియోగించి మీరు మరింత సుఖంగా బతకాలన్నదే నా కోరిక," అన్నాడు.

దేవరాజు ఇచ్చిన భరవసాతో అరణ్యా వాసులు దొంగల ముఠాలుగా తయారై విక్రమపురాన్ని దోచటం ప్రారంభించారు.

ఈ దొంగతనాలు ఒక ఉద్యమంగా సాగుతున్నాయని గ్రహించి విక్రమవర్మ దొంగలను పట్టే పని ప్రజలందరిదీ అని ప్రకటించాడు. ప్రజలు ముఠాలుగా ఏర్పడి గస్తీలు కాసి, అనేక మంది దొంగలను పట్టుకున్నారు. రాజు అందరు దొంగలనూ దేశ శత్రువులుగా ప్రకటించి ఉరితీయించాడు.

తరవాత ఆయన అరణ్యంలో ఉండే ప్రజలకు ఒక సందేశం పంపాడు: "మీ స్వేచ్ఛకు మేము ఎప్పుడూ ఎలాటి భంగమూ కలిగించము. మీరు కావాలంటే మా రాజ్యంలో పౌరులుగా ఉండవచ్చు. కాని మీరు దొంగలుగా మా రాజ్యపు సరిహద్దులోకి వస్తే మీకు మరణదండన తప్పక విధిస్తాను."

ఆకస్మికంగా ప్రారంభమైన దొంగతనాలు ఆకస్మికంగానే నిలిచిపోయాయి. దేవరాజు ఆశించినట్టు విక్రమపురంలో ఎలాంటి అరాజకం తలఎత్త లేదు. అరణ్య వాసులు విక్రమవర్మ వైఖరి సమంజసంగా ఉన్నదనీ, తప్పంతా తమ వాళ్ళదేననీ గ్రహించారు.

కాని అలా సరిపెట్టుకోని వాడు ఒకడున్నాడు. వాడి పేరు భీముడు. విక్రమపురానికి చాలా సమీపంలో ఉన్న అరణ్య ప్రాంతంలో ఈ భీముడూ, వాడి అన్న రాముడూ నివసిస్తూ ఉండేవాళ్ళు. రాముడు అరణ్య వాసులతోనే తిరుగుతూ, వారు చేసే పనులే చేస్తూ, ఇంచుమించు ఆటవికుడిలాగే జీవించేవాడు. భీముడు మాత్రం అడవిలో కట్టెలు కొట్టి, విక్రమపురంలో అమ్మి, తనకు కావలసిన వస్తువులు అక్కడి దుకాణాలలో కొనుక్కుని ఇంటికి తిరిగి వస్తూండేవాడు.

భీముడికి నగర జీవితం తెలుసు. నగరంలో వాడికి కొందరు పరిచితులూ, స్నేహితులూ ఉండేవారు.





ఒకనాడు విక్రమవర్మ వేట కోసం కొద్ది పరివారంతో అరణ్యానికి వచ్చాడు. ఆ సంగతి తెలియగానే శత్రుసైనికులు ఆయనను ఎదిరించారు. మిగతా సైనికులు రాజు వెంట ఉన్న పరివారాన్ని చుట్టుముట్టి భయంకరంగా పోరాడుతుంటే, శత్రుయోధుడు రాజుతో కలియబడి కత్తి యుద్ధం ప్రారంభించాడు.

రాజు అరణ్యంలో ఫలాని ప్రాంతానికి వేటకు వెళ్ళాడని తెలియగానే విల్లూ, బాణాలూ తీసుకుని భీముడు అక్కడికి వెళ్ళాడు. అతను రాజును చూసేసరికి, రాజు యోధుడితో తీవ్రమైన కత్తి యుద్ధంలో నిమగ్నుడై ఉన్నాడు. భీముడు తీవ్రమైన బాణాన్ని ఎక్కుపెట్టి దాన్ని రాజుకు గురి చూసి వదిలాడు. కాని అది రాజుకు తగలక, రాజుతో పోరే శత్రుయోధుడికి తగిలి, వాణ్ణి ఆ క్షణంలోనే చంపేసింది. గొప్ప ధైర్యశాలీ, ప్రతాపవంతుడూ అయిన తమ నాయకుడు చావగానే శత్రుసైనికులు పారిపోయారు.

రాజు భీముణ్ణి తన వద్దకు పిలిపించుకుని, అతని సహాయానికి కృతజ్ఞత తెలుపుకుని, అతన్ని తన వెంట నగరానికి తీసుకుపోయి, తన అంగరక్షకుడుగా నియమించాడు. రాజును చంపి తన అన్న చావుకు పగ తీర్చుకునేటందుకు ఇప్పుడు ఇంకా

అరణ్యంలో వాళ్ళు నగరంలో దొంగతనాలు ప్రారంభించినప్పుడు రాముడు వాళ్ళతో చేరి, పట్టుబడిపోయి, ఉరిశిక్ష అనుభవించాడు. ఉద్రేక స్వభావం గల భీముడు, తన అన్నను ఉరి తీయించినందుకు విక్రమవర్మ మీద పగపట్టి, ఆయనను హతమార్చి, తన అన్న ఆత్మకు శాంతి కలిగించటానికి పూనుకున్నాడు.

ఈ లోపల దేవరాజు కూడా అటువంటి నిర్ణయానికి వచ్చాడు. విక్రమపురంలో అరాజకం రాధని రూఢి కాగానే అతను విక్రమవర్మను చంపించటానికి ఒక సైనిక దళాన్ని ఒక యోధుడి నాయకత్వం కింద అరణ్యంలో ఏర్పాటు చేశాడు.

మంచి అవకాశం దొరికింది గదా అనుకుని భీముడు ఆ ఉద్యోగాన్ని స్వీకరించాడు.

దేవరాజు తన రెండవ ఎత్తు కూడా పారకపోయేసరికి మరొక ఎత్తు వేశాడు. అతను విక్రమవర్మ సేనాని వద్దకు తన చారుణ్ణి పంపి, "మీ రాజును మీరు హత్య చేసినట్టయితే విక్రమపురానికి మిమ్మల్ని రాజుగా అభిషేకిస్తాను. రాజు చచ్చిన అనంతరం ప్రజలలో తిరుగుబాటు జరిగితే దాన్ని అణచటానికి మీ సేనలూ, మా సేనలూ కలిసి పని చెయ్యవచ్చు. మీరు రాజుగా అభిషేకం పొందిన మీదట మనం స్నేహ పూర్వకమైన సంధి చేసుకుందాము. అది మన ఉభయరాజ్యాల క్షేమానికీ ఉపయోగ పడుతుంది," అని సందేశం అందజేశాడు.

రాజ్యలోభంతో విక్రమవర్మ సేనాని దేవరాజు వాగ్దానాలు నమ్మి, తన రాజును హత్య చేయనిశ్చయించాడు. అతను ఒక నాటి రాత్రి పొద్దుపోయి, రాజుగారి శయనాగారం వద్దకు వచ్చి, రాజుగారితో రహస్యం మాట్లాడాలని కబురుచేశాడు. రాజు సేనాని మాట నమ్మి, అతణ్ణి శయనాగారం లోపలికి రానిచ్చాడు.

ఈ లోపల భీముడు రాజును చంపే అవకాశం కోసం ఎంత ఎదురు చూసినా ప్రయోజనం లేకపోయింది. చివరకు అతను, రాజు శయనాగారంలో ఒంటరిగా వుండగా వెళ్ళి చంపటానికి నిశ్చయించాడు. సేనాని రాజుగారి శయనాగారం ప్రవేశించిన కొద్ది క్షణాలకు భీముడు వచ్చాడు. రాజుగారి



అంగరక్షకుడూ, రాజుగారిని ఒకసారి కాపాడినవాడూ గనక, ద్వారపాలకుడు అతన్ని అడ్డలేదు.

భీముడు శయనాగారం ప్రవేశిస్తూనే రాజుగారు సేనాని చేతిని గట్టిగా పట్టుకుని ఉండటమూ, సేనాని చేతిలో ఖడ్గం ఉండటమూ చూశాడు. అదే సమయమనుకుని భీముడు రాజు మీదికి తన కత్తిని బలంగా విసిరాడు. అది వెళ్ళి సేనాని గుండెలో గుచ్చుకున్నది.

తన ప్రాణం కాపాడినందుకు రాజు భీముణ్ణి ఆ క్షణంలో మెచ్చుకోవటమే గాక, మర్నాడు సభలో అతన్ని కొత్త సేనానిగా నియమించాడు.

అటు తరవాత భీముడు విక్రమవర్మను ఎంతో భక్తివిశ్వాసాలతో కొలుస్తూ తన అన్న చావుకు పగతీర్చుకునే ఉద్దేశాన్ని పూర్తిగా వదులుకున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, భీముడు తన పగను ఎందుకు అరిపోనిచ్చాడు? రాజు తనకు పెద్ద పదవి ఇచ్చాడనా? లేక తన పగతీరేయోగం లేదనా? రాజుకు దైవసహాయం ఏదో ఉన్నదనా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "భీముడిలో మార్పుకు కారణాలు అవేవీ కావు. రాజుకు తన అన్న మీద పగ ఏదీ లేదనీ, రాజుకు దేశక్షేమమే ప్రధానమనీ భీముడికి క్రమంగా తెలిసి వచ్చి ఉంటుంది. ఆయన ఎందరో దొంగలను ఉరితీయించాడు. అది తప్పుపని అని అడవిలో వాళ్ళుకూడా అనలేదు. తాను ఎవరో కూడా తెలియకుండా ఆయన తనను సేనాని చేశాడు. అందుకు నగరంలో వాళ్ళు ఎవరూ అభ్యంతరం చెప్పలేదు. రాజు మీద అన్నిరకాల వారికీ ఉండిన విశ్వాసం భీముడికి కూడా కలిగిందనుకోవాలి," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# ధారణశక్తి

జగన్నాథపండితరాయలు షాజహాను దర్శనం చేసుకుందామని ఢిల్లీ వెళ్ళి, దివాణం ముందు చాలా రోజులు పడిగాపులు కాచాడు.

ఒకనాడు పండితరాయలు బస చేసి ఉన్న సత్రంలో ఇద్దరు స్త్రీలు మాటామాటా పెంచుకుని, శిగపట్లకు దిగారు. ఇంతలో సిపాయిలు వచ్చి, వారిని విడదీసి, కలహానికి కారణం అడిగారు.

"అదే ముందు నన్ను తిట్టింది," అని ఇద్దరు స్త్రీలూ ఒకరి మీద ఒకరు ఫిర్యాదు చేశారు.

"మీ పోట్లాటను మొదటి నుంచి చూస్తున్న వారెవరైనా ఉన్నారా?" అని సిపాయిలు అడిగితే, ఆ స్త్రీలు పండితరాయలును చూపించారు.

భటులు ఆ ముగ్గురినీ తీసుకుపోయి పాదుషా ముందు నిలబెట్టారు.

స్త్రీలు ఉర్దూ భాషలో పోట్లాడుకున్నారు. పండితరాయలు సంస్కృతంలో పాండిత్యం గల తెలుగువాడు. అతడికి ఉర్దూ రాదు. కాని ఆయన ఉర్దూలో స్త్రీల సంభాషణ అంతా పొల్లుపోకుండా ఏకరువు పెట్టాడు.

పాదుషాతో బాటు సభలోని వారంతా పరమాశ్చర్యం చెందారు. పండితరాయల ధారణాశక్తికి మెచ్చుకుని, షాజహాన్ ఆయనను తన ఆస్థానకవిగా నియమించి గౌరవించాడు.

—వలమేటి సుందరరామయ్య.





# దాతృత్వం

చాలాకాలం క్రితం అక్షయపురంలో ధర్మపాలు డనే గొప్ప ధనికుడు ఉండేవాడు. ఆయన భార్య సులక్షణ. వారిద్దరూ ధర్మబుద్ధి కలవారు. వారికి ఉసిరికచెట్టును పూజించే ఆచారం ఉండేది. వ్యాపారంలో అనేక లక్షలు గడించిన ధర్మపాలుడు రోజూ ఒక పేదవాడికి బంగారు ఉసిరికాయ దానం చెయ్యకుండా భోజనం చేసేవాడు కాడు. అందుచేత ఆయన కీర్తి చాలా దూరం వ్యాపించింది.

ఈ దంపతులకు అయిదుగురు కొడుకులు. పెద్ద కొడుకుకు వివాహం చేశారు. పెద్ద కోడలు అత్తవారింట అడుగు పెడుతూనే, "అత్తగారూ, ఎంత ధనవంతులైతే మాత్రం రోజూ బంగారు ఉసిరికాయలు దానం చేస్తూ ఉంటే రెండో తరానికి ఏమి మిగులుతుంది? మేము బీదవాళ్ళమై అడుక్కు తినటం మీకు మాత్రం ఇష్టమా? కావాలంటే వెండి ఉసిరికాయలు దానం చెయ్యండి," అన్నది.

పెద్దవాళ్ళు చిన్నవాళ్ళ మాట పాటించి, రోజూ ఒక వెండి ఉసిరికాయ దానం చేస్తూ వచ్చారు.

ఇంతలో రెండో కోడలు కాపరానికి వచ్చింది ఆమె తన అత్తగారితో, "మీరు రోజూ వెండి ఉసిరికాయ దానం చేస్తే మా పిల్లలకు ఏమి మిగులుతుంది? కావాలంటే మీరు రాగి ఉసిరికాయ ఒకటి దానం చేస్తూ ఉండండి," అన్నది.

ఆమె మాట కూడా పాటించి రోజూ రాగి ఉసిరికాయలను వృద్ధదంపతులు దానం చేస్తూ వచ్చారు. దీనితో వారికి పూర్వం ఉండిన కీర్తి ప్రతిష్ఠలు చాలావరకు నశించాయి. తరవాత మూడో కోడలు వచ్చి, రాగి ఉసిరికాయలు దానం ఇవ్వవద్దనీ, ఇనుము ఉసిరికాయ లివ్వమనీ. అన్నది;

బి. సుమిత్రాదేవి

నాలుగో కోడలు వచ్చి, పిండితో చేసిన ఉసిరికాయలు దానం చేస్తే చాలు నన్నది. అయిదో కోడలు కాపరానికి వస్తూనే అది కూడా వద్దన్నది.

తమ కొడుకులతోనూ, కోడళ్ళతోనూ ఉంటే తమ దాతృత్వం సాగదని గ్రహించి ధర్మపాలుడూ, సులక్షణా తీర్థయాత్రలు చేసే నెపం మీద కొంత డబ్బు తీసుకుని ఇంటి నుంచి బయలుదేరి, సరయూనదీ తీరాన గల ఒక ఉసిరికవనం కొని, అందులోనే నివసించసాగారు. ధర్మపాలుడు ఉసిరికాయలతో లేహ్యాలూ, ఔషధాలూ తయారు చేసి, వాటిని విక్రయించి డబ్బు సంపాదించ నారంభించాడు. వ్యాపారంలో అయనకు బాగా కలిసి వచ్చింది. ఆయన తిరిగి లక్షాధికారి అయి, తనకు తృప్తిగా దానధర్మాలు చేస్తూనే మంచి ఇల్లు కట్టుకుని, ఒక దేవాలయం కూడా నిర్మించటానికి పూనుకున్నాడు.

ఈ లోపుగా ధర్మపాలుడి కొడుకులు తండ్రి ఆర్జించిన దంతా ఖర్చు చేశారు. వారికి సంపాదించే మార్గం తెలియదు గనక ఉన్నదంతా త్వరలోనే పోయి, వారికి పూట గడవని పరిస్థితి వచ్చింది. వాళ్ళు ఉన్న ఊరు వదిలి పెట్టి, కూలి చేసుకునే ఉద్దేశంతో ఊళ్ళ వెంబడి తిరగసాగారు. ఇంతలో వారికి, సరయూనదీ తీరాన గొప్ప దేవాలయం కట్టుతున్నారని తెలిసింది. ఆ ఆలయాన్ని కట్టిస్తున్నది ధర్మపాలుడే నన్న సంగతి వారికి తెలియదు. ధర్మపాలుడి



కొడుకులూ, కోడళ్ళూ అక్కడికిచేరి మిగతా కూలీలందరితో పాటు కూలిపనులు చెయ్యసాగారు.

దేవాలయం కట్టించే పుణ్యాత్ముడి భార్య పేదసాదలకు దానధర్మాలు చేస్తున్న సంగతి విని ధర్మపాలుడి కోడళ్ళు అయిదుగురూ ధర్మపాలుడి ఇంటికి వెళ్లారు. సులక్షణ వారిని కిటికీలో నుంచి చూసి, తన కోడళ్ళలాగున్నారని తోచి, వారి పేర్లూ, వారు వచ్చిన పనీ తెలుసుకు రమ్మని దాసీ దాన్ని పంపింది.

దాసీది తిరిగి వచ్చి చెప్పిన సమాధానాన్నిబట్టి ఆమె ఊహ నిజమయింది. తన కొడుకులూ, కోడళ్ళూ ఇలాంటి హీనస్థితికి ఎలా వచ్చారో ఆమె ఊహించ లేకపోయింది. కాని తన కోడళ్ళకు సరి అయిన గుణపాఠం నేర్పటానికి ఇది మంచి అవకాశం అని ఆమె అనుకున్నది. ఆమె తన పెట్టె అడుగు నుంచి ఒక వెండి ఉసిరికాయా, ఒక రాగి ఉసిరికాయా, ఒక ఇనుము ఉసిరికాయా తీసి, పిండితో ఒక ఉసిరికాయా చేసి, వాటన్నిటినీ తీసుకుని బయటికి వచ్చింది. కోడళ్ళు తమ అత్తను గుర్తించనే లేదు.

ఆమె పెద్ద కోడలికి వెండి ఉసిరికాయా, రెండో కోడలికి రాగిదీ, మూడో కోడలికి ఇనుముదీ, నాలుగో కోడలికి పిండిదీ ఇచ్చి, అయిదో కోడలితో, "అమ్మా, నీ కివ్వటానికి ఏమీ లేదు," అన్నది.

వెంటనే తోడి కోడళ్ళు ఒకరి మొహాలు ఒకరు చూసుకుని, తరవాత సులక్షణ కేసి చూసి, "అత్తా!" అంటూ ఆమె కాళ్ళ మీద పడి ఏడ్చారు. సులక్షణ వారి నందరినీ ఎత్తి కౌగలించుకుని, వారికి పట్టిన దుర్దశకు విచారించింది.

తరవాత ధర్మపాలుడు తన కొడుకులను కూడా పిలిపించి, వాళ్ళకు చక్కగా స్నానాలు చేయించి, బట్టలు పెట్టి, తన దగ్గిరే ఉంచుకున్నాడు. వాళ్ళు మంచి గుణపాఠం నేర్చుకుని, తాము కూడా శ్రమపడి ఆర్జిస్తూ, దానధర్మాలు చేస్తూ సుఖంగా జీవించారు.



# వెట్టి రద్దు!

హంగరీరాజు ప్రజలందరి చేతా వెట్టి చేయించేవాడు. ఒకసారి ఒక కాలవ తవ్వటానికి దేశంలోని మగవాళ్ళంతా రావాలని పిలుపు వచ్చింది. జనం సణుగుతూ పారలతో వచ్చి, తవ్వకంపని ప్రారంభించారు.

మధ్యాన్నం వేళ అందరూ పని చాలించి తిళ్ళు తింటూ ఉండగా ఒక దేశసంచారి వారి వద్దకు వచ్చి, "మీ రందరూ నాకు తలా ఒక డబ్బా ఇస్తే వెట్టి రద్దయే మార్గం చెబుతాను," అన్నాడు. అందరూ వాడికి తలా ఒక డబ్బా ఇచ్చారు.

"ఒక డబ్బు చాలదు. ఇంకొకటి ఇవ్వండి," అన్నాడు వాడు. చిరాకుపడుతూ అందరూ మళ్ళీ ఒక్కొక్క డబ్బు ఇచ్చారు.

"అది కూడా చాలదు. ఇంకొక్కొక్కటి కావాలి," అన్నాడు వాడు.

ప్రజలకు కోపం వచ్చింది. "దొంగముండా కొడకా!" అంటూ వాళ్ళు పారలు తీసుకుని వాడి మీదికి వెళ్ళారు.

"మీరు ఈ పని చెయ్యగలిగిన నాడు మీ వెట్టి రద్దవుతుంది. మీ డబ్బులు మీరు తీసుకోండి," అని ఎవరి డబ్బులు వారికి ఇచ్చి సంచారి వెళ్ళిపోయాడు.

1848 లో ప్రజలు తిరగబడి, వెట్టి రద్దు చేయించుకున్నారు.





# కీలుగుర్రం

## 4

కమరల్ అక్మార్ తన కీలుగుర్రం మీద ఆకాశగమనాన అతి వేగంగా ప్రయాణించి సనానగరాన్ని చేరుకున్నాడు. అతను రాజ భవనం పై భాగాన దిగి, గుర్రాన్ని అక్కడే వదిలి రాజకుమార్తె శయనాగారానికి మెట్లు దిగి చేరుకున్నాడు.

కొజ్జావాడు ఎప్పటిలాగే ద్వారానికి అడ్డంగా పడుకుని నిద్రపోతున్నాడు. కమర్ వాడి మీదుగా అంగవేసి,ముని వేళ్ళ మీద నిశ్శబ్దంగా నడుచుకుంటూ లోపలి ద్వారం దాకా వెళ్ళి, తెర వెనక ఆగాడు. లోపల తన ప్రియురాలు దుఃఖిస్తూ, జాలి పాటలు పాడుకుంటూ ఉండటం అతనికి విని పించింది.

చెలికత్తెలు ఆమెను ఓదార్చటానికి యత్నిస్తూ, "అమ్మా, నీ కోసం ఏడవని వాడి కోసం ఎందుకేడుస్తావు?" అన్నారు.

"ఏమిటే మీరనేది? నేను ప్రేమించే యువకుడు నన్ను మరిచిపోతాడా? అది ఎన్నటికీ జరగదు," అని రాజకుమార్తె తిరిగి శోకాలు పెట్టసాగింది.

ఆ శోకం వింటున్న కమర్‌కు గుండె ద్రవించిపోయింది. అతను తెర తొలగించు కుని లోపలికి వెళ్ళి, రాజకుమార్తెను ప్రేమగా స్పృశించాడు. ఆమె కళ్ళు తెరిచి తనను చూడగానే అతను, "ఎందుకీ కన్నీరు?" అని అడిగాడు.

ఆమె లేచి అతని మెడ చుట్టూ చేతులు వేసి, "నీ కోసమే! నన్ను విడిచి వెళ్ళి పోయావు గద," అన్నది.

"నీ తండ్రి నాకు ఎంత ద్రోహం చేశాడు? నిన్ను చూసి ఊరుకున్నాను గాని, లేకపోతే ఆయనను నా కత్తికి బలిచేసి ఉందును," అన్నాడు కమర్.

అరేబియా

"నన్ను విడిచిపోతే నా గతి ఏమవుతుం దనుకున్నావు ?" అని రాజకుమార్తె అతనితో అన్నది.

"నీకు నేనంటే అంత ప్రేమ ఉన్నది గనక, నేను చెప్పినట్టు చేస్తావా?" అని కమర్ ఆమెను అడిగాడు.

"నువు ఏం చెయ్యమంటే అది చేస్తాను." అన్నది రాజకుమార్తె.

"నాకు తగని ఆకలిగా ఉన్నది. తిన టమూ, తాగటమూ అయినాక మాట్లాడు కుందాం," అన్నాడు కమర్.

రాజకుమార్తె తన దాసీలను పంపి ఆహార పానీయాలు తెప్పించింది. వాళ్ళిద్దరూ భోజనం చేసి కబుర్లాడుతూండగానే తెల్ల వార వచ్చింది. కొజ్జావాడు లేవకముందే వెళ్ళిపోదామని కమర్ లేచాడు.

"ఎక్కడికి పోతున్నావు ?" అన్నది రాజ కుమార్తె షమ్స్.

"మా దేశానికి. నేను వారానికొకసారి వచ్చి నిన్ను చూస్తాను," అన్నాడు కమర్.

రాజకుమార్తె ఏడుస్తూ, "నీకు పుణ్యం ఉంటుంది. నన్ను నీ వెంట నీ యిష్టం వచ్చిన చోటికి తీసుకుపో. నేను మాత్రం నీ వియోగం భరించలేను. ఒంటరిగా వదిలి పోకు," అన్నది.

కమర్ సంతోషంతో, "నిజంగా నా వెంట వచ్చేస్తావా ? అయితే పద !" అంటూ




ఆమెను చెయ్యిపట్టి లేవదీశాడు. రాజ కుమార్తె ఒక పెట్టె తెరిచి, అందులోనుంచి వెలలేని తన ఆభరణాలన్నిటినీ తీసి ధరించి, అతని వెంట బయలుదేరింది. ఆమె దాసీ లెవరూ ఆమెను అడ్డటానికి సాహ సించలేదు.

కమర్ ఆమెతో కూడా పై మిద్దె మీదికి ఎక్కి వెళ్ళి, గుర్రం మీద ఎక్కి కూచుని, ఆమెను తన వెనక ఎక్కించుకుని, ఇద్దరి శరీరాలనూ గట్టిగా కలియగట్టి, గుర్రంతో సహా ఆకాశంలోకి లేచాడు. అది చూసిన దాసీలు కెవ్వున అరిచారు. ఆ అరుపులకు రాజూ, రాణీ నిద్ర లేచి, మిద్దె మీదికి వచ్చారు.



అప్పటికే కీలుగుర్రం గాలిలో కొంత ఎత్తు లేచింది. "మా పిల్లను ఎత్తుకు పోకు. మమ్మల్ని కనికరించు," అని రాజు కమర్‌కు కేక పెట్టాడు.

దీనికి కమర్ జవాబేమీ చెప్పలేదు, కాని రాజకుమార్తె తన తల్లి దండ్రుల కోసం బెంగపడుతుందేమోనని అతనికి అనుమానం కలిగింది. "నువు నీ తల్లిదండ్రుల వద్దకు తిరిగి పోతావా?" అని అతను ఆమెను అడిగాడు.

"నాకు నువ్వంటే చాలు, మా అమ్మా, నాన్నా అవసరం లేదు," అన్నదామె.

కమర్ ఈ మాటవిని సంతోషించి గుర్రాన్ని పూర్తి వేగంతో పోనిచ్చాడు. త్వరలోనే వారు సగందూరం వచ్చేశారు. కమర్ తన గుర్రాన్ని ఒక చక్కని మైదానంలో ఒక వాగుకు సమీపంలో దించాడు. అక్కడ వాళ్ళు భోజనాలు చేసి, కొంచెంసేపు విశ్రాంతి తీసుకుని, తిరిగి ప్రయాణం సాగించి, తెల్లవారే సరికి సాబూర్ ఏలే నగరానికి కనుచూపు మేర లోకి వచ్చారు.

తన ప్రియురాలు తమ నగరాన్నీ, తన తండ్రి వైభవాన్నీ చూసి ఎంతో అద్భుతం చెందు తుందనుకుని కమర్ ఉబలాట పడ్డాడు. అతను తన కీలుగుర్రాన్ని నగర ప్రాకారం వెలపల ఒక తోట మధ్య దించి, అక్కడ ఉన్న ఒక మండపంలోకి రాజ కుమార్తెను తీసుకు పోయాడు. ఆ మండపం రాజు తన కోసం కట్టించుకున్నది. రాజు ప్రతి ఉదయమూ ఆ తోటలోకి వాహ్యాళికి వస్తాడు.

"నువు కొద్దిసేపు ఇక్కడే కూర్చో, నేను వెళ్ళి మా తండ్రితో మనం వచ్చిన సంగతి చెబుతాను," అన్నాడు కమర్ రాజకుమార్తె షమ్సతో. ఆమె కోసం ఒక మందిరం సిద్ధం చేయించి, ఆమెను పిలుచుకు రాప టానికి మనిషిని పంపుతాననీ, అంతదాకా ఆమె తన కీలుగుర్రాన్ని చూస్తూ ఉండా లనీ కూడా అతను చెప్పి ఆమె వద్ద శలవు పుచ్చుకుని వెళ్ళిపోయాడు.

తనను లాంఛనాలతో ఊరేగించి నగరం లోకి తీసుకు పోతారని గ్రహించి రాజ కుమార్తె ఆనందంతో ఉప్పొంగి పోయింది.

తన కొడుకును తిరిగి చూడగానే సాబూర్ రాజుకు ఆనందంతో గుండె ఆగి పోయినంత పని అయింది. ఒక చెంప ఆనందాశ్రువులు రాల్చుతూ ఆయన తన కొడుకును మందలించాడు.

"నా వెంట ఎవరిని తెచ్చానో తెలుసా? సనా రాజకుమార్తెను తెచ్చాను. పర్షియాలో గాని, అరేబియాలో గాని అంతటి సౌందర్య వతి లేదు. ఆమెను నగరం వెలపల మన తోటలో దించాను. మన వైభవం కళ్ళు కట్టే ట్టుగా ఆమె నగర ప్రవేశమూ, ఊరేగింపూ ఏర్పాటు చేయాలి," అన్నాడు కమర్ తండ్రితో.

"అదెంత పని!" అని సాబూర్ రాజు నగరాలంకరణకు ఉత్తరువిచ్చి, వైభవో పేతమైన ఊరేగింపుకు ఏర్పాట్లు చేయిం చాడు. సైనికులూ, వాద్యబృందాలూ సన్నద్ధమయాయి. స్త్రీలూ, పిల్లలూ ఊరేగిం పుతో రావటానికి అలంకరించు కున్నారు.

కమర్ అమూల్యములైన ఆభరణాలు తన భార్య కోసం ఏరితీశాడు; ఎరుపూ, పచ్చా, ఆకుపచ్చ జరీ వస్త్రాలతో చాందినీ వేయించాడు. దాని కింద మణులు పొది గిన బంగారు సింహాసనం ఏర్పాటు చేయిం



చాడు; ఆసనం చుట్టూ యువకులైన బాని సలను నిలబెట్టాడు. దానిని మోయటానికి నీగ్రో బానిసలను పెట్టాడు.

ఈ ఊరేగింపు కాలి నడకన ఉద్యా నానికి చేరటం ఆలస్య మవుతుందని, కమర్ వడిగల గుర్రాన్ని ఎక్కి క్షణంలో రాజ కుమార్తె ఉన్నచోటికి తిరిగి వచ్చాడు.

కాని అక్కడ అతని కీలుగుర్రమూ లేదు, రాజకుమార్తెకూడా లేదు. కమర్ కంపరంచెంది, వెర్రివాడిలాగా తన ప్రియు రాలిని ఎలుగెత్తి పిలుస్తూ తోట అంతా పరి గెత్తాడు, బట్టలు చించుకున్నాడు.

ఉద్రేకం కొంత చల్లారాక అతను తాపీగా ఆలోచనలో పడి, "ఆమెకు కీలు

గుఱ్ఱం మరలు తెలియవు. వాటి రహస్యం నే నామెకు చెప్పలేదు. అందుచేత ఆమె గుఱ్ఱం మీద వెళ్ళిపోయి ఉండదు. గుఱ్ఱాన్ని తయారు చేసినవాడే తలపని తలంపుగా ఇటు కేసివచ్చి, ఆమెను చూసి, నా మీద పగసాధించటానికి ఆమెను గుఱ్ఱం మీద ఎక్కించుకుని వెళ్ళిపోయి ఉంటాడు," అనుకున్నాడు.

వెంటనే అతను ఉద్యానవన ద్వారం వద్దకు వెళ్ళి, "ఇటుగా ఎవరైనా లోపలికి వచ్చారా?" అని ద్వార రక్షకులను అడిగాడు.

"పర్షియను విజ్ఞాని ఏదో మూలికల కోసం లోపలికి వెళ్ళాడు. ఆయన ఇంకా బయటికి రాలేదు. అంతకు మించి మరె వరూ లోపలికి పోలేదు," అన్నారు ద్వార రక్షకులు.

ఆ ముసలివాడే రాజకుమార్తెను ఎత్తుకు పోయాడన్నది రూఢి అయింది. అతను పుట్టెడు విచారంతో ఊరేగింపుకు ఎదురు వెళ్ళి, తన తండ్రికి జరిగిన సంగతిని తెలిపాడు.

"నాన్నా, నువు ఊరేగింపును వెనక్కు తీసుకుపో. ఈ సంగతి ఏమిటో అంతు తేల్చుకోకుండా నేను తిరిగి రాను," అన్నాడతను తండ్రితో.

సాబూర్ రాజు ఆవేదన పడుతూ, "నన్నెందుకు వేధిస్తావురా, నాయనా? జరిగినదేదో జరిగింది, నువు కోరిన రాజకుమార్తె నిచ్చి నీకు నేను పెళ్ళి చేస్తాను," అన్నాడు.



కమర్ తండ్రి మాటలు వినిపించుకోక, "వస్తాను! నువ్వేమీ విచారించకు," అని మాత్రం అని గుర్రాన్ని దౌడుతీయిస్తూ వెళ్ళిపోయాడు.

రాజు కన్నీరు కార్చుతూ, మూలుగుతూ పుట్టెడు దుఃఖంతో ఇంటికి తిరిగి వచ్చాడు. రాజ భవనమంతా తిరిగి శోకాందోళనలలో మునిగిపోయింది.

ఆ రోజు పర్షియా విజ్ఞాని ఉద్యానంలోకి రావటం మూలికల కోసమే వచ్చాడు. కాని తోటలో అతనికి కస్తూరి, అగరు వాసనలు తగిలాయి. అవి వస్తున్న వేపు వెళ్ళి అతను మండపంలో రాజకుమార్తెను చూశాడు. దగ్గరలోనే తాను తయారు చేసిన కీలుగుర్రం కూడా ఉన్నది. అది పోయిన క్షణం నుంచీ అతను నిద్రాహారాలెరగడు. అది తిరిగి తనకు లభ్యమయిందని అతను పొందిన ఆనందం వర్ణనాతీతం.

అతను మొదట గుర్రంతో సహా వెళ్ళిపోదామనుకున్నాడు. కాని అతనికి రాజకుమార్తె గురించి తెలుసుకోవాలనిపించింది. అతను మండపంలోకి అడుగుపెట్టి, ఆమెకు వంగి సలాము చేశాడు.

ఆమె తల ఎత్తి అతన్ని చూసి, "ఎవరు నువు?" అని అడిగింది.

"అమ్మా, నన్ను రాజకుమారుడు పంపాడు. నగరానికి మరింత సమీపంగా ఇంకొక అందమైన మండపం ఉన్నది. మిమ్మల్ని అక్కడికి చేర్చమన్నారు. సంగతి ఏమిటంటే, రాణిగారికి ఇవాళ కొంచెం



అస్వస్థతగా ఉన్నది. వారు మీకు స్వయంగా స్వాగతం చెప్పటానికి మిమ్మల్ని దగ్గిరికి రప్పించుకుంటున్నారు, అంతే," అన్నాడు ముసలివాడు.

"మరి రాజకుమారుడెక్కడ?" అని షమ్స్ అడిగింది.

"వారు రాజుగారి వెంట ఉన్నారు. త్వరలోనే ఊరేగింపుతో వస్తారు," అన్నాడు ముసలివాడు.

"నా దగ్గిరికి పంపటానికి ఆయనకు నీ అంత వికారితప్ప మరెవరూ దొరక లేదా?" అని రాజకుమార్తె కోపంగా ముసలి వాణ్ణి అడిగింది.

"అమ్మా, నాకన్న వికారమైన మనిషి రాజభవనంలో లేనిమాట నిజమే. కాని మీరు నా అనాకారితనం చూసి నా శక్తులను సందేహించ వద్దు. వాటిని గురించి ఎప్పటికైనా మీకు తెలుస్తుంది. నేను అనాకారివాణ్ణి కనకనే రాజకుమారుడు నన్ను పంపి ఉండవచ్చు కూడా. నిజానికి రాజభవనంలో అందం తక్కువ కానివారు ఎందరో ఉన్నారు. వారిని పంపటం రాజకుమారుడికి ఇష్టం కాకపోయి ఉండవచ్చు." అన్నాడు పర్షియావిజ్ఞాని.

రాజకుమార్తె ఈ మాటలను నమ్మి, ముసలివాడి చెయ్యి పట్టుకుని లేచి, "బాబూ, నన్ను ఎలా తీసుకుపోతారు?" అని అడిగింది.

"మీరు వచ్చిన గుర్రం ఉన్నది గద?" అన్నాడు ముసలివాడు.

"గుర్రమైతే వున్నది. కాని, దాన్ని ఎలా నడపాలో నాకు తెలీదు గదా," అన్నది రాజకుమార్తె.

"దాన్ని నేను నడుపుతాను," అని ముసలివాడు గుర్రం మీద ఎక్కి కూర్చుని, రాజకుమార్తెను తన వెనక ఎక్కించుకుని, ఆమెను తన కేసి దృఢంగా బంధించి, మీట తిప్పాడు.

గుర్రం శరవేగంతో ఆకాశంలోకి లేచింది. త్వరలోనే నగరమూ, తోటలూ కనుచూపు మేరలో లేకుండాపోయాయి.

—(ముగింపు పై సంచికలో)






సింగివనంలో ఉండే నాయకుణ్ణి అతడి తమ్ముడు చేంగీ అనేవాడు హత్య చేశాడు. అప్పుడు నాయకుడి కొడుకు వాంబీ చంటి పిల్లవాడు. వాంబీ తల్లి రాత్రి చీకట్లో చేంగి మనుషుల కళ్ళు కప్పి ఆ పసి కూనను తీసుకుని, అరణ్యం అవతల ఉన్న నగరానికి పారిపోయింది. నగరంలో ఒక మిషనరీదొర ఆమెకు ఆశ్రయం ఇచ్చి, వాంబీని పెంచి పెద్దవాణ్ణి చేశాడు. వాంబీ బలిష్ఠుడూ, దృఢ కాయుడుగా తయారయాడు. అతను పద్దెనిమిది ఏళ్ళవాడై ఉండగా అతని తల్లి పాము కరిచి మరణించింది.

మరణించే ముందు ఆమె వాంబీతో, "నాయనా, నువు రాచబిడ్డవు. సింగివనానికి రాజు కావలిసిన వాడివి. నీ పినతండ్రి చేంగీ నీ తండ్రిని హత్యచేసి, అక్రమంగా నాయకుడయాడు. నువు రాచబిడ్డ వన్నందుకు గుర్తు...." అని మాట పూర్తి చెయ్యకుండానే ప్రాణం విడిచింది.

ఆమె ఈ సంగతి తన కొడుక్కుగాని, మిషనరీ దొరకుగాని ముందుగా చెప్పక పోవటానికి కారణం ఏమంటే, చేంగి మనుషులు నగరంలో కూడా తిరుగుతూనే వచ్చారు. వారికి వాంబీ జాడ తెలియటం ప్రమాదం.

తల్లి చెప్పిన సంగతి విని వాంబీకి దుఃఖం ముంచు కొచ్చింది. ప్రతీకారం కోసం అతని రక్తం ఉడికి పోయింది. అతను తన తల్లి శవాన్ని తాకి, పక్షంరోజుల లోపల చేంగీపై పగతీర్చు కుంటానని ఘోర ప్రమాణం చేశాడు.

మర్నాడే అతను బయలుదేరి, వేటగాళ్ళు వెళ్ళే మార్గాల వెంట నడిచి, చీకటి పడే వేళకు సింగివనం చేరాడు. ఆ రాత్రి అతను ఒక చెట్టు మీద గడిపి, అక్కడి

పి. సి. సర్కార్, ఇంద్రజాలికుడు



నుంచి పరిసరాలు తెలుసు కుందామనుకున్నాడు, కాని చీకట్లో అతనికి ఏమీ కనిపించలేదు.

తెల్లవారే సరికి పరిసరాలు తెలియవచ్చాయి. అతను చెట్టు దిగాడు. జిరాఫ్ మీద ఎక్కి ఒక వింత మనిషి అటుగా వచ్చాడు. వాడి నెత్తిన ఎనుము కొమ్ములూ, దేగ ఈకలూ, ముళ్ళూ గల శిరోవేష్టం ఉన్నది: వాడు సింహం చర్మం ధరించి, చేతిలో బల్లెం పట్టుకుని ఉన్నాడు.

ఆ ఆటవికుడు తన బల్లాన్ని వాంబీకి గురిపెట్టి, "ఎవరు నువ్వు?" అని అడిగాడు.

వాంబీ తెలివిగా, "తెల్లదొర వేటబృందంలో వాణ్ణి, దారి తప్పాను," అంటూ జేబులో నుంచి సిగరెట్టు వెలిగించే లైటరు తీసి, "ఇది అగ్గి మర," అని దాన్ని వెలిగించి ఆటవికుడికి అందించాడు.

ఆటవికుడు దానికేసి నోరుతెరిచి చూశాడు.

"అది నీకు కావాలా?" అని వాంబీ అడిగాడు. ఆటవికుడు తల ఆడించాడు.

"తీసుకో. కొద్ది రోజులు నన్ను మీ ఇంట ఉండనిస్తావా?" అన్నాడు వాంబీ.

"అమ్మో! మా చేంగీదొర కర్కోటకుడు. మా దేశంలో పైవాళ్ళు ఉండటానికి ఎంత మాత్రమూ వీల్లేదు," అన్నాడు ఆటవికుడు.

"కాని నేను తప్పని సరిగా నీతో ఉండాలి. మనం స్నేహం చేసుకుందాం. పైవాళ్ళు మీ ప్రాంతంలో ఉండటానికి మీ దొర ఎందుకు ఒప్పడూ?" అని వాంబీ అడిగాడు.

"ఆయనకు వాంబీ భయం. నిజానికి వాంబీ మాకు అసలు దొర. అతను చచ్చిపోయిన మా దొరకు ఒకడే కొడుకు. చచ్చిపోయిన దొర ఎంత మంచివాడు, ఎంత గొప్పవాడు! పశువులాటి చేంగీ ఆయనను చంపాడు. ఆయనకు నేనంటే ఎంతో ప్రేమ. ఆయన పరివారంలో నేను చాలా ముఖ్యుణ్ణి. అందుకే చేంగీకి నన్ను చూస్తే తగని అనుమానం," అన్నాడు ఆటవికుడు.

"వాంబీ తిరిగి వచ్చి తన పదవి అడుగు తాడని చేంగీకి భయమా? వాంబీ ఇంకా బతికే ఉన్నాడా?" అని వాంబీ అడిగాడు.

"చేంగీ మనుషులు కొందరు అనటం వాంబీ ఇంకా బతికే ఉన్నాడనే. వాంబీనీ, అతని తల్లినీ మా నాన్న పొలిమేరదాకా సాగనంపాడని ఆరోపణ జరిగింది. ఆ ఆరోపణ నమ్మి చేంగీ మా నాన్నను దహనం చేయించాడు." అన్నాడు ఆటవికుడు.

"అన్నట్టు, నీ పేరేమిటి?" అని వాంబీ అడిగాడు.

"సింహదమనుడు డింగూ!" అన్నాడు ఆటవికుడు.

"చూడు, డింగూ! వాంబీ తిరిగి వస్తే నువు సంతోషిస్తావా? జనం మాట ఏమిటి? వాళ్ళు సంతోషిస్తారా?" అని వాంబీ అడిగాడు.

"నేను సంతోషించనా? చేంగీ నా తండ్రిని చంపించాడు. ఆ దుర్మార్గుడి మీద పగ తీర్చుకుంటానని ప్రమాణం చేశాను. జనం సంతోషిస్తారనుకో. అయితే వారికి మాంత్రికుడి మాటమీద చాలాగురి. మాంత్రికుడు చేంగీకి కుడిభుజం. వాంబీని తాను మంత్ర శక్తితో చంపేశాననీ, తిరిగివస్తే వాంబీ దయ్యమై రావలిసిందే ననీ, అదే జరిగితే పంటలూ, పశువులూ నాశన మవుతాయనీ మాంత్రికుడు అంటున్నాడు." అన్నాడు డింగూ.

"అయితే మీరంతా ఈ మంత్రాలతోనే బతుకుతున్నారన్నమాట! నేను మీ కష్టా





లన్నీ కడతేర్చి, మీకు చేంగీ పీడ వదిలించే టట్టుంటే నువు సహాయపడగలవా ?" అని వాంబీ అడిగాడు.

"నా ప్రాణం ఇచ్చేస్తాను," అన్నాడు డింగూ.

"భేష్! మనం ఇప్పుడే ప్రయత్నాలు ప్రారంభించుదాం. నేను వాంబీ మిత్రుణ్ణి. అతను బతికే ఉన్నాడు. రావటానికి సిద్ధంగా కూడా ఉన్నాడు," అన్నాడు వాంబీ.

డింగూ జిరాఫ్ మీది నుంచి కిందికి గెంతి తన వెంట ఉన్న అదనపు దుస్తులు కొన్ని వాంబీకి ఇచ్చాడు. ఇద్దరూ చీకటి పడినదాకా అక్కడే ఉండి పోవటానికి నిశ్చయించుకున్నారు.

చీకటి పడింది. డింగూ వాంబీని తన కుటీరానికి తెచ్చాడు. మంత్రాన్ని తంత్రంతో జయించటానికి వాంబీ నిశ్చయించాడు. మిషనరీ దొర దగ్గిర అతను కొన్ని ట్రిక్కులు నేర్చుకుని ఉన్నాడు.

"మాంత్రికులలో వాంబీ తిరిగి రావాలనుకునే వాళ్ళు ఎవరైనా నీకు తెలుసా?" అని అతను డింగూను అడిగాడు.

"చేంగీకి కుడి భుజమైన వేంగేచూ తప్ప అందరికీ వాంబీ తిరిగి రావాలనే! ముఖ్యంగా, మా పాత నాయకుడి ప్రధాన మాంత్రికుడు సించూ అంటే ప్రజలకు చాలా అభిమానం," అన్నాడు డింగూ.

"అలా అయితే, ఉల్లిపాయ కోసి రసం తీసి, దానితో ఈ కాగితం మీద మీ భాషలో ఇలా రాయి: 'వాంబీ సజీవుడు. అతన్ని నాయకుణ్ణి చెయ్యండి. ఇది గోడుడుదేవత అజ్ఞ' అలా గడ్డి కుచ్చుతో రాసి, కాగితం ఆరబెట్టు. ఈ కాగితాన్ని తీసుకుపోయి మాంత్రికుడు సించూకు ఇయ్యి. గోడుడు దేవత తనకు కలలో కనిపించి తనను నీలి కొండకు వెళ్ళి, అక్కడ రాతినెర్రెలో ఉన్న కాగితం తెమ్మన్నాడనీ, తరవాత దానిని నిప్పు సెగకు చూపిస్తే అందులో తన ఆజ్ఞ ఉంటుందని చెప్పాడనీ సించూను ప్రజలతో చెప్పమను. ఇది ప్రజలకు చెప్పే ముందు సింఛూ వెళ్ళి ఈ కాగితాన్ని

ఆ కొండ మీద గుర్తుగా పెట్టాలి. సీంచూను నా దగ్గిరికి పంపు. నేను చెప్పినట్టు చేస్తే ఏమి జరిగేదీ నేను ఆయనకు వివరంగా చెబుతాను," అన్నాడు వాంబీ.

వాంబీ పథకం సవ్యంగా అమలు జరిగింది: సీంచూతో బాటు అనేక మంది మాంత్రికులు ప్రజలను వెంటబెట్టుకుని నీలి కొండ దగ్గిరికి వెళ్ళారు. అక్కడ సీంచూ చెప్పినట్టే కాగితం దొరికింది. దానితో జనం గోడుడుదేవత ఆలయానికి వచ్చి, నాయకుడు మొదలైన వారి సమక్షంలో అగ్ని చేశారు. సీంచూ మంత్రాలు చదివాడు. కాగితాన్ని పెద్దలంతా పరీక్షించారు. దాని మీద ఏమీ లేదు. తరవాత ఆ కాగితాన్ని అగ్నికి సమీపంగా పెట్టారు. కాగితం మీద గోధుమ రంగులో అక్షరాలు క్రమంగా ప్రత్యక్షం కాసాగాయి.

"వాంబీ సజీవుడు. అతణ్ణి నాయకుణ్ణి చెయ్యండి. ఇది గోడుడుదేవత ఆజ్ఞ."

అది చూసి చేంగీ నిర్ఘాంతపోయాడు. అతని భటులే అతన్నీ, వోంగేచూ మాంత్రికుణ్ణీ చుట్టుముట్టి, బల్లాలు వారి మీదికి బారు చేశారు.

"కాని వాంబీ ఎక్కడున్నాడు? నేను నా మంత్ర శక్తితో ఎప్పుడో చంపేశాను!" అని వోంగేచూ అరిచాడు.

"నేను చావలేదు. ఇక్కడే ఉన్నాను," అంటూ వాంబీ ముందుకు వచ్చాడు.

"వాణ్ణి పట్టండి! మోసగాడు!" అని చేంగీ అరిచాడు.

సీంచూ ప్రశాంతంగా, "ఇతను నిజంగా వాంబీ అయితే నేను ఇతను పుట్టినప్పుడు వేసిన రాచ ముద్ర ఎడమ చంక కింద ఉంటుంది. అతను ఎడమ చెయ్యి ఎత్తితే కనిపిస్తుంది," అన్నాడు.

వాంబీ ఎడమ చెయ్యి ఎత్తాడు. అతని చంక కింద కాల్చిన గుర్తు కనిపించింది. జనం హర్షధ్వానాలు చేశారు.

చేంగీ, వోంగేచూ పారిపోవటానికి ప్రయత్నించి జనానికి చిక్కిపోయారు.

"వాళ్ళను మన పొలిమేర నుంచి శాశ్వతంగా బహిష్కరించండి," అన్నాడు వాంబీ.






# ప్రత్యుపకారం

శివయ్య నడివయసు వాడు. ఆయనకున్న సంతానం ఒకే ఒక కుమార్తె. ఆమెకు పెళ్ళి చెయ్యాలి. పిల్ల పెళ్ళి చెయ్యాలంటే కనీసం వెయ్యి రూపాయలైనా ఉండాలి. శివయ్య దగ్గిర అంత డబ్బు లేదు. ఆయన చేసే ఉద్యోగం గురవయ్యశెట్టి దగ్గిర ఖాతా పుస్తకాలు రాయటం.

శివయ్య తండ్రి తన కాలంలో బాగా ఉన్నవాడే. దయాగుణం కలవాడు కావటం చేత ఊళ్ళో అందరికీ సహాయం చేసి ఉన్నదంతా ఖర్చు చేసుకుని, ఆయన శివయ్యకు ఏమీ మిగలకుండా చేశాడు. ఇప్పుడు శివయ్యకు ఉద్యోగం ఇచ్చిన గురవయ్యశెట్టి కూడా శివయ్య తండ్రి సహాయంతో వ్యాపారం చేసి పైకి వచ్చినవాడే!

శివయ్య తన కూతురికి పొరుగూళ్ళో సంబంధం చూశాడు. సంబంధం మంచిదే. కట్నం వెయ్యిరూపాయలు ఇచ్చుకోవాలి. తన తండ్రి వల్ల సహాయం పొందినవారు ఊళ్ళో ఎందరో ఉండగా తనకు వెయ్యి రూపాయలు అప్పు పుట్టకపోతుందా అన్న ధైర్యంతో శివయ్య ఆ సంబంధం నిశ్చయం చేసి, ముహూర్తం కూడా నిర్ణయించాడు.

కాని ఎవరూ అప్పుగా కూడా శివయ్యకు ఆర్థిక సహాయం చెయ్యలేదు. ఆఖరుకు గురవయ్యశెట్టి కూడా తన వల్ల కాదన్నాడు.

శివయ్య నీరుకారిపోయాడు. నిశ్చయించిన సంబంధాన్ని వదులుకోవటం తప్ప ఆయనకు మార్గాంతరం లేదు. కాని ముహూర్తం పెట్టుకోవటం కూడా అయిపోయాక తాను వెనక్కు తగ్గటం మర్యాద కాదు. అందుచేత తన పరిస్థితి పెళ్ళికొడుకు తరపు వారికి వివరించి చెప్పి, చివరి నిర్ణయం వారినే చెయ్యనియ్యటం మేలని శివయ్యకు తోచింది. ఆయన పొరుగూరు వెళ్ళ నిశ్చయించుకున్నాడు.

ఎం. కామేశ్వరరావు

తన ప్రయాణం గురించి ఎవరికీ తెలియటం గాని, తానై చెప్పటంగాని ఇష్టం లేక, శివయ్య ఇంకా ఝూము రాత్రి ఉండనగానే ఇంటి నుంచి బయలుదేరాడు. అసలే అమావాస్య రాత్రి, డొంకదారి, నక్కలు ఊళ పెడుతున్నాయి. గుడ్లగూబలు కూస్తున్నాయి. గబ్బిలాలు నెత్తి మీదిగా ఎగురుతున్నాయి. కీచురాళ్ళ ధ్వని చాలా హెచ్చుగా ఉన్నది. ఇప్పట్లో తెల్లవారదు. శివయ్యకు కొద్దిగా దయ్యాలభయం పట్టుకున్నది.

అదే క్షణంలో శివయ్య తనకు ముందుగా మరెవరో నడుస్తూ ఉండటం చూశాడు. ఆ మనిషి చేతిలో ఒక సంచీ ఉన్నది. ఆ మనిషిని చూడగానే శివయ్యకు ధైర్యం తిరిగి వచ్చింది. ఆయన చప్పట్లుచరిచి, "ఎవరా వెళ్ళేది? ఎక్కడిదాకా?" అని అడిగాడు.

ముందుపోయే మనిషి ఆగి, శివయ్య సమీపంలోకి రాగానే, "నా పేరు పంతులు అంటారు. నేను పొరుగూరు పోతున్నాను. మీ రెవరు?" అని అడిగాడు.

"నా పేరు శివయ్య. నేనూ ఆ ఊరికే," అన్నాడు శివయ్య.

ఇద్దరూ కలిసి నడక సాగించారు.

"ఆ ఊళ్ళో మీరు ఏం చేస్తూ ఉంటారు? మీ ఇల్లు ఎక్కడ?" అని శివయ్య పంతులును అడిగాడు.



"ప్రస్తుతం నాకు పని ఏమీ లేదు. మా ఇల్లు ఊరి మధ్య రావిచెట్టు కిందనే," అన్నాడు పంతులు.

శివయ్య పంతులుకు తన సమస్య వివరంగా చెప్పుకుని, "మా నాన్న మా ఊళ్ళో ఎందరికో సహాయం చేసి బికారి అయిపోయాడు. కాని ఆయన సహాయం పొందినవారు ఒక్కరూ అవసరానికి నన్ను ఆదుకోకుండా ఉన్నారు," అన్నాడు.

"అంతకన్న ద్రోహం ఉంటుందా? మీ ఊళ్ళో సాంబయ్యగారని ఉండేవారు. ఆయన సహాయం పొంది ఎన్నో ఏళ్ళయినా నేను దాన్ని మరిచిపోలేను," అన్నాడు పంతులు.

సాంబయ్యే తన తండ్రేనని శివయ్య చెప్పబోతూ ఉండగా పంతులు శివయ్య చేతికి సంచీ ఇస్తూ, "దీన్ని ఒక్క క్షణం పట్టుకోండి. ఇప్పుడే వస్తాను," అంటూ పొదల చాటుకు వెళ్ళాడు.

ఆయన తిరిగి వస్తాడని చాలాసేపు చూసి శివయ్య నిమ్మళంగా నడుస్తూ పొరుగూరు చేరుకున్నాడు.

అప్పటికి తెల్లవారవస్తున్నది. శివయ్య గ్రామంలో ప్రవేశించిన కొద్ది సేపట్లోనే రావిచెట్టూ, దాని కింద ఇల్లూ కనిపించాయి. ఇంటి ముందు అరుగు మీద ఒక ముసలావిడ కూర్చుని ఉన్నది.

"పంతులుగారి ఇల్లు ఇదేనా, అమ్మా? ఆయన కాస్త వెనకపడ్డాడు. నేను తొందరగా పని చూసుకుని మా వూరు వెళ్ళాలి. ఆయన సంచీ ఇక్కడ ఇచ్చిపోదామని అడుగుతున్నాను," అన్నాడు శివయ్య ముసలావిడతో.

"ఏ పంతులుగారూ? పాతికేళ్ళ క్రితం పోయిన మా మామగారా?" అన్నది ముసలావిడ. శివయ్య నిర్ఘాంతపోయాడు. తాను చూసినది దయ్యమా అనుకున్నాడు.

శివయ్య పంతులిచ్చిన సంచీ నుంచి మూట ఒకటి పైకి తీశాడు. ఆ మూట విప్పితే అందులో మూడు వేల రూపాయల నగదు ఉన్నది.

"అమ్మా, ఈ డబ్బు న్యాయంగా మీదే. తీసుకోండి," అన్నాడు శివయ్య.

"లేదు, నాయనా. పంతులుగారు ఏ కారణం చేతనో దాన్ని నీ కోసమే ఇచ్చారు," అన్నది ముసలావిడ.

పంతులు ఒకప్పుడు తన తండ్రి నుంచి సహాయం పొందినట్టు చెప్పాడు. ఇది తనకు పంతులు చేసిన ప్రత్యుపకారమన్నమాట!

"అయినా, ఇంత డబ్బు నాకు అవసరం లేదు. ఇందులో సగం మీరు తీసుకోండి," అని శివయ్య, ఆవిడ వద్దంటున్నా, పదిహేను వందలు ఆవిడ కిచ్చి మిగతాది తాను ఉంచుకున్నాడు.

శివయ్య కూతురు పెళ్ళి నిర్విఘ్నంగా జరిగిపోయింది.





# అపనమ్మకం

పూర్వం ఒక నగరంలో కొప్పిశెట్టి అనే వజ్రాల వ్యాపారస్థుడు ఉండేవాడు. ఆయన తనకూ తన ఇంటికీ రక్షగా గోవిందుడు అనే జెట్టిని నౌకరుగా నియమించుకున్నాడు. గోవిందుడు మహాబలశాలి.

అయితే శెట్టికి గోవిందుడి మీద నమ్మకం లేదు. ఎవరైనా వజ్రాలు బేరం చెయ్యటానికి తన వద్దకు వచ్చినప్పుడు శెట్టి గోవిందుణ్ణి ఏదో పని మీద ఎక్కడికైనా పంపేసేవాడు. తన వద్ద ఉన్న వజ్రాలు గోవిందుడి కంట పడితే, వాడు తనకే ద్రోహం చేస్తాడని ఆయనకు భయం.

కొంతకాలం గడిచినాక గోవిందుడు శెట్టికి తన మీద నమ్మకం లేదని గ్రహించాడు. అవకాశం దొరికితే శెట్టి కళ్ళు తెరిపించాలని వాడు అనుకున్నాడు.

ఒకనాడు శెట్టి లోపల భోజనం చేస్తున్న సమయంలో ఇద్దరు పెద్దమనుషుల లాటి వాళ్ళు లోపలికి వస్తూ, వసారాలో కూర్చుని ఉన్న గోవిందుణ్ణి చూసి గతుక్కుమన్నారు.

గోవిందుడు వాళ్ళను చూసి లేస్తూ, "దయచెయ్యండి! దయచెయ్యండి!" అన్నాడు.

అందులో ఒకడు గోవిందుడి దగ్గిరికి వచ్చి, "శెట్టిగారు ఏం చేస్తున్నారు?" అని అడిగాడు.

"లోపల భోజనం చేస్తున్నారు," అన్నాడు గోవిందుడు.

ఆ మనిషి గోవిందుడితో రహస్యంగా, "శెట్టి వద్ద మొత్తం ఏ మాత్రం విలువ చేసే వజ్రాలున్నాయి? అవన్నీ ఎక్కడ ఉంటాయి? మాకు సహాయం చేశావంటే నీకు మాతోబాటు వాటాయిస్తాం," అన్నాడు.

గోవిందుడు వారిద్దరినీ పరకాయించి చూసి, "ఒక్క క్షణం ఉండండి. అన్ని సంగతులూ కనుక్కుని వస్తాను," అన్నాడు.

బూర్లె నాగేశ్వరరావు

వాడు లోపలికి వెళ్ళి, "అయ్యగారూ, వజ్రాలు కొనటానికి ఎవరో ధనికులు దూర దేశం నుంచి వచ్చారు. పెద్ద బేరంలాగుంది. త్వరగా రండి," అన్నాడు.

శెట్టి ఈ మాట వింటూనే భోజనం ముగించి, చెయ్యి కడుక్కుని వచ్చి, "నువు వాళ్ళను కూర్చోబెట్టి, మన ఊరి చెరువులో నీళ్ళు ఏ మాత్రం ఉన్నదీచూసిరా, వెళ్ళు," అని గోవిందుడితో అన్నాడు.

"అలాగే, బాబూ!" అంటూ గోవిందుడు పెద్దమనుషులు చూస్తూండగానే బయటికి వెళ్ళిపోయాడు.

అదే సమయమనుకుని, పెద్దమనుషుల్లాగా వచ్చిన దొంగలిద్దరూ లోపల జొరపడి, శెట్టిని కాళ్ళూ, చేతులూ బంధించి, పెట్టె తెరిచి, అందులో ఉన్న వజ్రాలన్నీ సంచుల్లో నింపుకుని, "గోవిందా! గోవిందా!" అని కేకలు పెడుతున్న శెట్టి నోట గుడ్డలు కుక్కి, బయటికి జారుకున్నారు.

గోవిందుడు ఆటే దూరం వెళ్ళలేదు. వాడు దొంగల కోసం కొద్ది దూరంలో కాపు వేసి ఉండి, వాళ్ళు కనిపించగానే, "పని పూర్తి అయిందా?" అని అడిగాడు.

"అయింది, అయింది! ఇదుగో నీ వాటా!" అన్నారు దొంగలు.

"దొంగ వెధవల్లారా! వాటా తీసుకునేటందుకు నేను మీ వంటి వాణ్ణి అనుకున్నారా?" అంటూ గోవిందుడు సంచులు పట్టుకున్న వాణ్ణి మొహం పగిలేటట్టు కొట్టాడు. వాడు కిందపడి నెత్తురుకక్కాడు.

గోవిందుడు సంచులు రెండూ తీసుకుని శెట్టి ఇంటికి వచ్చాడు.

శెట్టి వాణ్ణి చూస్తూనే బావురుమని, "వచ్చావా, గోవిందా? నా సొత్తంతా దోచుకున్నారు," అంటూ మొత్తుకున్నాడు.

"వాళ్ళకు నేను తగిన బుద్ధి చెప్పాను. మీ సరుకంతా ఉన్నదో లేదో చూసుకోండి," అంటూ గోవిందుడు సంచులను శెట్టి ముందు పడేసి, శెట్టి కట్లు విప్పాడు.

శెట్టి తన వజ్రాలన్నీ తిరిగి దొరికినట్టు తెలిసి, "నువు ఇంత విశ్వాసపాత్రుడివని తెలీక నీకు ద్రోహం చేశానురా!" అన్నాడు.





# చిత్రకారుడి చాతుర్యం

పూర్వం మధ్యదేశం నుంచి ఒక ప్రతిభా వంతుడైన చిత్రకారుడు యవనదేశం వెళ్ళాడు. అక్కడ ఒక అపూర్వమైన యంత్రాచార్యుడు ఉండేవాడు. ఆయన చిత్రకారుడికి తన ఇంట బస ఏర్పాటు చేసి, తన అతిథికి సేవలు చెయ్యటానికి తాను తయారు చేసిన ఒక యంత్రపుస్త్రీ బొమ్మను నియోగించాడు.

ఆ యంత్రపుస్త్రీ చిత్రకారుడికి కాళ్ళు కడిగి వెళ్ళిపోతున్నది. ఆ బొమ్మను చూసి చిత్రకారుడు నిజమైన స్త్రీయే అనుకుని, ఆమెను పలకరించాడు. కాని ఆమె జవాబు చెప్పలేదు.

చిత్రకారుడు ఆమెను చెయ్యి పట్టుకు లాగాడు. దాని లోపలి కీళ్ళు సడలి, బొమ్మ కింద పడిపోయింది. అది యంత్రపుబొమ్మ అని చిత్రకారుడు గ్రహించి యంత్రా చార్యుడి తెలివికి ఆశ్చర్యపడ్డాడు. కాని ఆ యవనయంత్రాచార్యుడు తనకు ఆ బొమ్మను గురించి చెప్పక, పరాభవం చేశాడు. ఇది చిత్రకారుడికి భరించరాని దయింది. ఈ పరాభవానికి తగిన ప్రతీకారం చేసి, యంత్రాచార్యుడికి తన ప్రతిభ కూడా ఎంత అద్భుతమైనదో ప్రదర్శించి, గుణ పాఠం చెప్పాలని చిత్రకారుడు నిశ్చయించు కున్నాడు.

వెంటనే అతను, తాను ఉరిపోసుకుని వేళ్ళాడుతున్నట్టుగా ఒక చిత్రాన్ని చిత్రించి, ఆ చిత్రాన్ని తన గదిలోకి తొంగి చూసే వారికి కనిపించేలాగా అమర్చాడు. తరవాత అతను ఆ గదిలోనే ఒక మూలగా పడవేసి వున్న పాత కొయ్య సామానుల వెనక్కు పోయి దాక్కుని, యంత్రాచార్యుడి కోసం ఎదురు చూడసాగాడు.

కొంతసేపటికి యంత్రాచార్యుడు ఆ గది ముందుగా వెళుతూ, గది తలుపులు తెరిచి

ఎం. రవీంద్రరెడ్డి

ఉండటం చూసి, అదేమిటా అని గదిలోకి తొంగి చూశాడు. అతనికి నేల మీద పడి ఉన్న యంత్రపు బొమ్మా, చిత్రకారుడు ఉరిపోసుకుని వేళ్ళాడుతూ ఉండటమూ కనిపించాయి.

ఆ దృశ్యం చూసి యంత్రాచార్యుడు భయపడి పోయాడు. తాను తయారు చేసిన యంత్రపు బొమ్మ చెడిపోయిందన్న విచారం ఆయనకు కించిత్తు కూడా కలగలేదు. కాని ఎక్కడో భారతదేశం నుంచి వచ్చి తన ఇంట బస చేస్తున్న వాడు ఉరిపోసుకు చనిపోయాడంటే తనకు తీరని నింద కలుగుతుంది. ఏ కారణం చేత ఇలాంటి ఘోరం జరిగిందో అధికారులు విచారించటం మంచిది.

అలా అనుకుని యంత్రాచార్యుడు తన దేశపు రాజుగారి వద్దకు వెళ్ళి జరిగినదంతా చెప్పాడు. ఏమి జరిగినదీ వివరంగా తెలుసుకు రమ్మని రాజుగారు తన కొలువులో ఉండే అధికారులను కొందరిని శిల్పి ఇంటికి పంపాడు.

అధికారులు వచ్చి చిత్రకారుడి గదిలోకి చూశారు. గదిలోని కొక్కెం నుంచి వేలాడుతున్న చిత్రకారుడి శవం వారికి కనిపించింది.

శవాన్ని కిందికి దింపే మార్గం ఏమిటని వారు ఆలోచించారు. కొందరు చిత్రకారుడి గొంతుకు బిగిసివున్న తాడు కొయ్యటానికి కత్తులూ, కటార్లూ తెచ్చారు.

ఇంతలో, గది లోపల దాగి ఉండిన చిత్రకారుడు ఇవతలికి వచ్చాడు. అతన్ని చూసి అందరూ నిర్ఘాంతపోయారు.

చిత్రకారుడు యంత్రాచార్యుడితో, "అయ్యా, మీరు యంత్రపుస్త్రీని నియోగించి నన్ను భ్రమింపజేసిన మాట నిజమే. అయితే మీ తెలివితేటలతో నన్ను ఒక్కణ్ణే భ్రమింపజేశారు. కాని నేను నా తెలివి ఉపయోగించి మిమ్మల్ని, రాజుగారు పంపిన ఈ అధికారులందరినీ కూడా భ్రమింపజేశాను," అన్నాడు.

ఆ మాట విని యంత్రాచార్యుడు సిగ్గుతో తలవంచుకున్నాడు.






అరుణపురంలో వీరమల్లు అనె దొంగ ఉండేవాడు. వాడు ఇళ్ళకు కన్నాలు వేసీ, దారులుకాచీ ప్రజలను దోచుకుని తన జీవనం సాగించేవాడు.

ఒక రాత్రి వీరమల్లు ఒక ఇంటికి కన్నం వెయ్యబోతూ ఉండగా వాడికి లోపలి వాళ్ళు మేలుకుని ఉన్నట్టు తెలిసింది. ఇద్దరు వ్యక్తులు మాట్లాడుకుంటున్నారు.

ఒక యువకుడు తన తల్లితో, "అమ్మా, నేను రేపు తెల్లవారుతూనే పొరుగూరు వెళ్ళాలి. అందుకని నాకు నా పాలు అన్నమూ, మట్టిపాలు అన్నమూ మూటలు కట్టి ఇయ్యి," అన్నాడు.

తల్లి, "సరేలే, నాయనా!" అన్నది.

తరవాత తల్లి కొడుకులు ఇద్దరూ నిద్రపోయారు.

ఈ సంభాషణ విన్న వీరమల్లు తాను వచ్చిన పని కూడా మరిచిపోయాడు. వాడికి కొడుకు అన్న మాటలు కొంచెంకూడా అర్థం కాలేదు. వాటి అర్థం ఏమిటో తెలుసుకోవాలని వాడికి పట్టుదల పుట్టు కొచ్చింది. తెల్లవారిన దాకా వాడు అక్కడే నిలబడ్డాడు.

తెల్లవారు ఝామున ఇంటిలో ఉండే తల్లి కొడుకులు నిద్ర లేచారు. కొడుకు ప్రయాణానికి సిద్ధమవుతూంటే తల్లి వాడికి రెండు మూటలు కట్టి ఇచ్చింది.

తల్లి ఇచ్చిన రెండు మూటలూ తీసుకుని కొడుకు ఇంటి నుంచి బయలుదేరాడు. అతనికి కొంచెం వెనకగా వీరమల్లు కూడా బయలుదేరాడు.

మధ్యాన్న మయింది. యువకుడు ఒక చెట్టు నీడన కూర్చున్నాడు. వీరమల్లు కూడా అదే నీడన, యువకుడికి కొంత దూరంలో కూర్చున్నాడు.

యువకుడు వీరమల్లు కేసి చూసి, తన తల్లి కట్టి ఇచ్చిన మూటలు రెండూ విప్పి,

ఎస్. శ్రీనివాస్

ఒకటి తన ముందు ఉంచుకుని, రెండవది వీరమల్లు ముందుపెట్టాడు.

ఆ యువకుడి ప్రవర్తన వీరమల్లుకు ఆశ్చర్యం కలిగించింది. ఈ యువకుడు తనను ఎరగడు. తాను ఆ యువకుణ్ణి ఎరగడు. అయినా ఆ యువకుడు తాను అడగకుండానే తనకు ఆహారం పెట్టాడు. ఎరిగి ఉన్న వాళ్ళకుకూడా జన్మలో ఎన్నడూ ఎలాటి ఉపకారమూ చెయ్యని వీరమల్లుకు యువకుడి ప్రవర్తన ఎంతో వింతగా తోచింది.

తన అనుమానం తీర్చుకునేటందుకు ఇదే మంచి సమయం అనుకుని వీరమల్లు, "అయ్యా, నా కొక సందేహం. ఆ సందేహాన్ని తీర్చినట్టయితే మీరిచ్చిన ఆహారం పుచ్చుకుంటాను," అన్నాడు యువకుడితో.

"అడుగు," అన్నాడు యువకుడు.

"నా వృత్తి దొంగతనాలు చెయ్యటం. నేను నిన్న రాత్రి మీ ఇంటికి కన్నం వెయ్యటానికి వచ్చి, నువు మీ అమ్మతో అన్న మాటలు విన్నాను. వాటికి అర్థమేమిటో తెలియలేదు. అది తెలుసు కుందామనే నీ వెంటపడి వచ్చాను," అన్నాడు వీరమల్లు.

యువకుడు నవ్వి, "చూడు, నేను తినే అన్నం మట్టిపాలు అన్నం. నీ కిచ్చినది నా పాలు అన్నం," అన్నాడు.

"ఆ మాట అసలు అర్థం కాలేదు. నువు తిన్నది నీ పాలు అవుతుంది గాని, నేను తినేది నీ పాలు ఎలా అవుతుంది?" అని వీరమల్లు అడిగాడు.

"నేను తిన్నది ఒక పూటకూడా ఉండదు. అది జీర్ణమై మట్టిపాలు అయిపోతుంది. కాని నేను నీకు పెట్టినది పుణ్యం రూపంలో నాకు శాశ్వతంగా దక్కుతుంది. నువు దొంగతనాలు చేసి సంపాదించినది అనుభవిస్తున్నావు. అది ఖర్చు అయిపోతున్నది. కాని నువు ఇతరులకు చేసినది ఏమిటి?" అన్నాడు యువకుడు.

ఈ మాటతో దొంగకు కళ్ళు తెరుచుకున్నట్టు అయింది. వాడు తన వృత్తిమానేసి, కష్టపడి పనిచేసి, ఇతరులకు సహాయం చేస్తూ జీవించటం నేర్చుకున్నాడు.






పరశురాముడు మాట్లాడటం చాలించగానే కణ్వమహాముని కౌరవసభలో దుర్యోధనుడితో, "ధర్మరాజుతో సంధిచేసు కోవటం మంచిది. కౌరవ పాండవులు భూమి నంతనూ కలిసి పాలించవచ్చు. నువే బలవంతుణ్ణనుకోకు. అవతల వాళ్లుకూడా బలవంతులే అయినప్పుడు బలం అనేదానికి అర్థంలేదు. ఈ సందర్భంలో నీకు మాతలి కథ చెబుతాను," అంటూ ఇలా చెప్పాడు:

దేవేంద్రుడి సారథి అయిన మాతలికి లేక లేక ఒక చక్కదనాల కూతురు కలిగింది. గుణకేశి అనే ఆ పిల్ల అందచందాలలో అందరు స్త్రీలనూ మించింది. ఆమెకు యుక్త వయసు వచ్చేసరికి ఆమె తల్లిదండ్రులు ఆమె వివాహం తలపెట్టారు. మాతలి ఎంత వెతికినా తన కుమార్తెకు తగిన వరుడు ఎక్కడా లభించలేదు. దేవలోకంలోనూ, మానవలోకంలోనూ చూడటం అయిన తరవాత మాతలి తన కుమార్తెతో సహా నాగలోకానికి ప్రయాణమయాడు.

దారిలో అతనికి నారదుడు తటస్థపడి, "నేను వరుణుడి వద్దకు పోతున్నాను. నీ ప్రయాణం ఎక్కడికి?" అని అడిగాడు. మాతలి తాము పోతున్న పని నారదుడికి చెప్పి, "నేను కూడా వరుణుడి దగ్గిరికే పోతున్నాను," అన్నాడు.

ఇద్దరూ కలిసి వరుణుడి దగ్గిరికి వెళ్లారు. వరుణుడు వారి కిద్దరికీ తగిన విధంగా అతిథి సత్కారాలు చేసి, మాతలి వచ్చిన పని తెలుసుకుని, నాగలోకంలో

49. విశ్వరూప సందర్శనం



తిరగటానికి అనుమతి ఇచ్చాడు. నారదుడూ, మాతలీ నాగలోకమంతా తిరిగి, అనేకమంది యువకులను చూశారు. శేషుడుండే భోగవతీపురంలో సుముఖుడు అనే నాగయువకుడు మాతలికి నచ్చాడు.

"గుణకేశికి ఈ కుర్రవాడు తగిన వరుడు. అందుచేత అతన్ని వివాహానికి ఒప్పించు," అని మాతలి నారదుణ్ణి కోరాడు.

నారదుడు సుముఖుడి తాత అయిన ఆర్యకుడికి మాతలిని పరిచయంచేసి, అతని కోరిక తెలిపాడు.

ఆర్యకుడు ఈ మాటకు సంతోషించి కూడా పైకి దైన్యం కనబరుస్తూ, "నారదా, ఈ వివాహానికి ఎలా ఒప్పుకోను? ఇటీవలనే గరుత్మంతుడు నా కొడుకును చంపి తిని, వచ్చే మాసంలో నా మనమడైన సుముఖుణ్ణి తింటానని ప్రతిజ్ఞచేసి వెళ్లాడు. నా కొడుకు పోయినందుకూ, నా మనమడు పోబోతున్నందుకూ మేము పుట్టెడు దుఃఖంలో మునిగి ఉన్నాం. గరుత్మంతుడు అన్నంత పనీ చేస్తాడు. నేనీ సంబంధానికి ఎలా ఒప్పుకోను?" అన్నాడు.

ఆ మాటవిని మాతలి కొంచెం ఆలోచించి, "మహానుభావా, నాకొక ఆలోచన తట్టింది. నీ మనమడైన సుముఖుణ్ణి నా వెంటా, నారదుడి వెంటా ఇంద్రుడి వద్దకు పంపిస్తే, నేను చెయ్యవలసినది చేసి, అతనికి పూర్ణాయువు కలిగేటట్టు చూస్తాను. గరుత్మంతుడు ఇతని జోలికి రాకుండా చూస్తాను. మీ కందరికీ సుఖం కలుగుతుంది," అన్నాడు.

ఆర్యకుడు అందుకు సమ్మతించాడు. మాతలి సుముఖుణ్ణీ, ఇతర ముఖ్యులనూ వెంట బెట్టుకుని ఇంద్రుడి వద్దకు తిరిగి వచ్చాడు. అక్కడ విష్ణువు దేవేంద్రుడితో కబుర్లాడుతూ ఉన్నాడు. మాతలి తన అభిప్రాయం చెప్పగానే విష్ణువు ఇంద్రుడితో, "సుముఖుడికి అమృతం ఇచ్చి దేవతలతో సమానుణ్ణి చెయ్యి. ఆ విధంగా మాతలి, నారదుల కోరిక తీరుతుంది," అన్నాడు.

గరుత్మంతుడికి ఆగ్రహం తెప్పించటానికి జంకి ఇంద్రుడు విష్ణువుతో, "సుముఖుడికి నువే అమృతం ఇయ్యి," అన్నాడు.

"అన్ని లోకాలనూ పాలించే వాడివి, నిన్ను ఆపగల వారెవరు? నువే సుముఖుడికి అమృతం ఇయ్యి." అన్నాడు విష్ణువు.

కాని ఇంద్రుడు సుముఖుడికి దీర్ఘాయువు ఇచ్చాడు గాని అమృతం ఇయ్యలేదు. సుముఖుడు గరుత్మంతుడి భయం తీరి, మాతలి కుమార్తెను పెళ్లాడి సుఖంగా ఉన్నాడు.

ఈ సంగతి తెలిసి గరుత్మంతుడు మండిపడి, ఇంద్రుడి వద్దకు వచ్చి, "నా నోటి ముందున్న ఆహారానికి ఏమని అడ్డం తగిలావు? ఆహారం లేక నేనూ నా వాళ్లూ చచ్చిపోమా? నేను ఎంత బలవంతుణ్ణి! నన్ను తేలికగా చూస్తావా? నేను నిన్ను ఒక చిన్న ఈకతో మోయగలను," అన్నాడు.

అప్పుడు విష్ణువు, "గరుడుడా, నా ఎదుటనే ప్రగల్భాలాడకు. నన్ను మోస్తున్నాననుకుని నీకు గర్వంగా ఉన్నది. నిజానికి నేనే నిన్ను మోస్తున్నాను. చేతనైతే నా ఎడమచెయ్యి మోయి!" అంటూ తన ఎడమ చేతిని గరుత్మంతుడి వీపు మీద పెట్టాడు. దాని బరువుకు గరుత్మంతుడు కూలబడిపోయి కళ్ళు తేలవేశాడు. అతనికి ప్రాణాలు పోతున్నట్టు అనిపించింది.



గరుత్మంతుడు క్షమాపణ చెప్పుకుని, తనను కాపాడమని విష్ణువును వేడుకున్నాడు.

కణ్వుడు దుర్యోధనుడికి ఈ కథ చెప్పి, "దుర్యోధనా, పాండవులు యుద్ధంలో నిన్ను తలపడగానే నీకుకూడా గరుత్మంతుడికి జరిగిన భంగపాటే కలుగుతుంది. మిమ్మల్ని కాపాడటానికి కృష్ణుడు వచ్చాడు. అతను చెప్పినట్టు చేసి నీ కులాన్ని కాపాడుకో," అన్నాడు.

దుర్యోధనుడు కర్ణుడి కేసి చూసి వెకిలిగా నవ్వాడు. తరవాత అతను కణ్వుడితో, "మహర్షీ, నన్ను దేవుడు ఇలా పుట్టించాడు. నాకు ఎలా జరగవలసి ఉన్నదో నా ప్రవర్తన




దానికి అనుగుణంగా ఉన్నది. నాకు వెయ్యి మాటలుచెప్పి ఏంప్రయోజనం?" అన్నాడు.

తరవాత నారదుడు దుర్యోధనుడితో, "నాయనా, హితం చెప్పేవాళ్ళు చాలా అరుదు. అలాటి వాళ్ళు మంచిమాటలు చెబితే మొండికెయ్యరాదు. దీనికి దృష్టాంతంగా నీకు గాలవుడి కథ చెబుతాను," అంటూ ఇలా చెప్పాడు:

గాలవుడు విశ్వామిత్రుడి శిష్యుడు. అతను విద్య పూర్తిచేసుకుని వెళ్ళిపోతూ విశ్వామిత్రుడికి గురుదక్షిణ ఇస్తానని మొండి పట్టు పట్టాడు; విశ్వామిత్రుడు దక్షిణ అవసరం లేదని ఎంత చెప్పినా విన్నాడు కాడు.

"అలా అయితే, ఒక్క చెవి మాత్రం నల్లగా ఉండే తెల్లని గుర్రాలు ఎనిమి వందలు పట్టుకురా!" అన్నాడు విశ్వామిత్రుడు చిరాకుతో.

గాలవుడి ప్రాణంమీదికి వచ్చింది. అతని దగ్గిర చిల్లిగవ్వలేదు. గురువుగారు కోరిన గుర్రాలు ఎక్కడ ఉంటాయో తెలీదు. అతను విష్ణుమూర్తిని ధ్యానించాడు.

అంతలో గరుత్మంతుడు వచ్చి, "నన్ను విష్ణువు పంపాడు. ఎక్కడికి కావాలంటే అక్కడికి తీసుకుపోతాను," అన్నాడు.

గాలవుడు సంతోషించి, గరుత్మంతుడి వీపుమీద ఎక్కి తూర్పుగా పొమ్మన్నాడు. గరుత్మంతుడు అతివేగంగా పోతుంటే గాలవుడికి ఏమీ కనిపించలేదు, స్పృహ తప్పిపోతున్నది.

"అయ్యో, అంతవేగంగా పోకు. నేను గుర్రాల కోసం వెతుకుతున్నాను," అన్నాడు గాలవుడు.

"ఆ మాట మొదటే ఎందుకు చెప్పలేదు?" అని గరుత్మంతుడు గాలవుడితో కూడా ఋషభం అనే పర్వతంమీద దిగాడు. శాండిలి అనే తపస్విని వారికి ఆతిథ్యం ఇచ్చింది.

తరవాత గరుత్మంతుడు, "నీకు ముందు ధనం కావాలి. దానితో గుర్రాలు సంపాదించు. ప్రతిష్ఠానపురం ఏలే యయాతి

నా మిత్రుడు, గొప్ప ధనికుడు. అతని వద్దకు పోయి ధనం అడుగు,'' అని గాలవుణ్ణి యయాతి దగ్గిరికి తీసుకుపోయాడు.

యయాతి గరుత్మంతుడి ద్వారా గాలవుడి వృత్తాంతం తెలుసుకుని గరుత్మంతుడితో, "మిత్రమా, పూర్వంలాగా నా దగ్గిర ఇప్పుడు ధనం లేదు. అయినా, నా కుమార్తెను మాధవిని ఈ బ్రాహ్మణుడికి ఇస్తాను. ఆమె సహాయంతో ఇతని కోరిక తీరనీ,'' అని గాలవుడికి మాధవిని ఇచ్చాడు.

"ఈ పిల్ల ద్వారా నీకు కావలిసిన గుర్రాలు సంపాదించుకో. నేను పోతాను,'' అని గరుత్మంతుడు వెళ్ళిపోయాడు.



తరవాత గాలవుడు మాధవిని వెంటబెట్టుకుని, అయోధ్యారాజైన హర్యశ్వు డనే వాడి వద్దకు వెళ్ళాడు. అతను వచ్చిన పని తెలిసి హర్యశ్వుడు, "గాలవ మహర్షీ, ఈ పిల్ల సర్వలక్షణ సంపన్నగా ఉన్నది. నా దగ్గిర గుర్రాలు అనేకంగానే ఉన్నాయి గాని నీకు కావలసిన గుర్రాలు రెండు వందలు మాత్రమే ఉన్నాయి,'' అన్నాడు.

"నన్ను ఈ విధంగా ఇతర రాజులకు కూడా ఇచ్చి నీకు కావలిసిన ఎనిమిది వందల గుర్రాలూ సంపాదించుకో,'' అని మాధవి చెప్పినమీదట గాలవుడు ఆమెను హర్యశ్వుడికి ఇచ్చి రెండు వందల గుర్రాలు తీసుకున్నాడు.

మాధవి వల్ల ఒక కొడుకును కనిన తరవాత హర్యశ్వుడు ఆమెను గాలవుడికి తిరిగి ఇచ్చేశాడు.

తరవాత గాలవుడు మాధవిని తీసుకుని దివోదాసుడు ఏలే కాశీకి వెళ్ళాడు. దివోదాసుడి వద్ద కూడా గాలవుడు కోరిన గుర్రాలు రెండువందలే ఉన్నాయి. అతను ఒక కొడుకు పుట్టినదాకా మాధవిని తన భార్యగా ఉంచుకుని, తరవాత ఆమెను గాలవుడికి తిరిగి ఇచ్చేశాడు.

అప్పుడు గాలవుడు ఆమెను ఉశీనరుడు ఏలే భోజనగరానికి తీసుకుపోయి, అతనికి కొడుకు పుట్టిన దాకా మాధవిని భార్యగా ఇచ్చి, తిరిగి ఆమెను వెంటబెట్టుకుని



బయలుదేరాడు. ఉశీనరుడి వద్ద కూడా రెండువందల గుర్రాలే ఉన్నాయి.

ఇంకా రెండు వందల గుర్రాలు కావాలి. అవి ఎక్కడ దొరుకుతాయో తెలీదు. అంతలో గాలవుడికి గరుత్మంతుడు ఎదురై, జరిగినదంతా విని, "గాలవా, మిగిలిన గుర్రాల కోసం శ్రమపడకు. ఒక చెవి నల్లగా ఉండే తెల్లని గుర్రాలు ప్రపంచంలో మరి లేవు. మిగిలిన రెండు వందల గుర్రాలకు బదులు ఈ మాధవినే విశ్వామిత్రుడికి ఇచ్చెయ్యి." అని సలహా ఇచ్చాడు.

గాలవుడు మాధవిని విశ్వామిత్రుడి వద్దకు తీసుకుపోయి, తన గురుదక్షిణ కింద ఆరువందల గుర్రాలనూ, మాధవినీ ఇచ్చాడు. విశ్వామిత్రుడు మాధవిని సంతోషంగా స్వీకరించాడు.

నారదుడు ఈ కథ చెప్పి, "దుర్యోధనా, మొండి పట్టుదల వల్ల గాలవుడు ఇన్ని పాట్లు పడవలసి వచ్చింది. అందుచేత నువు మొండితనం మాని నీ హితం కోరి చెప్పే వాళ్ళ మాటలు విను," అన్నాడు.

అప్పుడు ధృతరాష్ట్రుడు కృష్ణుడితో, "కృష్ణా, జరుగుతున్నదేదీ నాకు సమ్మతం కాదు, కాని నేను పరాధీనుణ్ణి. ఈ దుర్యోధనుడికి బుద్ధిచెప్పటం మా కెవరికీ సాధ్యం కాలేదు, నువు చెప్పి చూడు," అన్నాడు.

కృష్ణుడు దుర్యోధనుడితో, "దుర్యోధనా, నువు తలపెట్టినది నీ వంటి వాడు చేసే పని కాదు, దుర్మార్గులు చెయ్యవలసినది. నీకు సలహా ఇస్తున్న వారి కన్న నువే జ్ఞానివి. పాండవుల సఖ్యం నీకు ధర్మార్థకామాలనిస్తుంది. యుద్ధం సర్వనాశనకారి. పాండవుల పరాక్రమాన్ని సరిగా గ్రహించు. నువు వారితో సంధి చేసుకుంటే నీ వారంతా సంతోషిస్తారు," అన్నాడు.

భీష్ముడూ, ద్రోణుడూ కూడా కృష్ణుడి మాటలను బలపరిచారు. విదురుడు దుర్యోధనుడితో, "నువు ఏమైనా నాకు చింత లేదు. నేను నీ తల్లిదండ్రులైన గాంధారీ ధృతరాష్ట్రులను గురించి విచారిస్తున్నాను.

నీ వంటి కొడుకును కన్నందుకు వాళ్ళు దిక్కులేని వాళ్ళు కాబోతున్నారు." అన్నాడు. ధృతరాష్ట్రుడు దుర్యోధనుడితో, "నాయనా, కృష్ణుడి స్నేహం మనకు అన్ని విధాలా మంచిది. ఈ అవకాశాన్ని జార విడవకు," అన్నాడు.

ఎవరి మాటలూ దుర్యోధనుడికి నచ్చ లేదు. అతను కృష్ణుడితో, "అందరూ నన్నే నిందిస్తున్నారు. నువు పాండవ పక్షపాతిగా మాట్లాడావుగాని ఉభయపక్షాల బలాబలాలు ఆలోచించి మాట్లాడలేదు. నేను చేసిన మహా పాపం ఏమిటో నాకు తెలియటం లేదు. పాండవులు ఇష్టపడి జూదమాడి, అరణ్యానికి పోతే అది నా తప్పా? పాండవులు మా మీదికి ఎందుకు యుద్ధానికి పూనుకున్నారు? మా అపరాధం ఏమిటి? నేను ఇంద్రుడికైనా భయపడను. వారు క్షత్రియధర్మంతో యుద్ధానికి వస్తే మేము యుద్ధంలో చావటానికైనా సిద్ధమే. నాకు ఏమీ తెలియనప్పుడు పాండవులకు రాజ్యం ఇవ్వబడింది. నేను బతికి ఉండగా ఆ రాజ్యం వారికి తిరిగి రాదు. సూది మొన మోపి నంత భూమి కూడా నేను వారికి ఇయ్యను. నాతో ఇన్ని మాటలు చెప్పి ప్రయోజనం లేదు," అన్నాడు.

కృష్ణుడు దుర్యోధనుడితో, "నీ కోరిక తీరి నీకు వీరమరణం లభిస్తుందిలే! నువు



పాండవులకు అన్ని విధాలా ద్రోహం చేసి ఏ తప్పూ చెయ్యలేదంటున్నావు. నీకు పతనం తప్పదు. మంచిగా అడుగుతుంటే పాండవుల తండ్రి రాజ్యం పాండవుల కియ్యవు. రేపు వారు మొత్తం రాజ్యం తీసుకుంటారు," అన్నాడు.

దుర్యోధనుడు కోపంతో సభనుంచి వెళ్ళి పోయాడు. అతని పక్షం వారంతా అతని వెంట వెళ్ళిపోయారు.

అప్పుడు కృష్ణుడు ధృతరాష్ట్రుడితో, "మహారాజా, వంశ నాశనం కాకుండా చూడాలంటే పెద్దలందరూ దుర్యోధనుడు మొదలైన వారిని బంధించి పాండవుల వశం చేసి, వారితో సంధి చేసుకోండి," అన్నాడు.



61

ధృతరాష్ట్రుడు ఈ మాటకు కంగారుపడి దుర్యోధనుడికి గాంధారి చేత చెప్పించి చూశాడు. ప్రయోజనం లేక పోయింది.

దుర్యోధనుణ్ణీ, అతని మంత్రులనూ బంధించి పాండవులకు అప్పగించ బోతు న్నట్టు దుశ్శాసనుడు దుర్యోధనుడితో చెప్పాడు. "మనమే ముందుగా కృష్ణుణ్ణి బంధించి, పాండవులను కోరలు తీసిన పాముల్లాగా చేద్దాం," అన్నాడతను.

ఈ సంగతి సాత్యకి ఎలాగో పసికట్టాడు. అతను కృతవర్మతో, "నేను కృష్ణుడితో ఈ సంగతి చెప్పివస్తాను. నువు ఈలోపల మన సైనికులతో సభా ద్వారం దగ్గిర సిద్ధంగా ఉండు," అని చెప్పి, సభలోకి వెళ్ళి కృష్ణుడితో అతన్ని కట్టెయ్యటానికి దుష్టచతుష్టయం ప్రయత్నించ బోతు న్నట్టు చెప్పాడు. తరవాత అతను ఇదే సంగతి ధృతరాష్ట్రుడికీ, విదురుడికీ చెప్పి, సభలో ఉన్నవారందరికీ చెప్పాడు.

ధృతరాష్ట్రుడు దుర్యోధనుణ్ణి సభకు పిలిపించి చివాట్లు పెట్టాడు. విదురుడు కూడా అతన్ని మందలించాడు. కృష్ణుడు అతనితో, "నేనిక్కడ ఒంటరిగా ఉన్నా ననా నీ ఉద్దేశం? నా వెంట సమస్త పాండవ సేనా, అంధక వృష్ణియోధులూ, ఆదిత్యులూ, రుద్రులూ, వసువులూ, ఋషులూ ఉన్నారు, చూడు!" అన్నాడు.

మరుక్షణం కృష్ణుడి శరీరమంతటా అందరూ అంగుళం ప్రమాణంలో, మెరు పుల్లాగా ప్రకాశిస్తూ, మంటలు కక్కుతూ కనిపించారు. కృష్ణుడి నుదుట బ్రహ్మ, వక్షస్థలాన ఏకాదశ రుద్రులూ, భుజాలలో దిక్పాలకులూ, ముఖాన అగ్ని కనిపించారు.

ఆ ఘోరరూపాన్ని చూడలేక సభలో అందరూ కళ్ళు మూసుకున్నారు. కృష్ణుడు దివ్యదృష్టి ఇవ్వటం చేత ద్రోణుడూ, భీష్ముడూ, విదురుడూ, సంజయుడూ, ఆ విశ్వరూపాన్ని చూడగలిగారు.

"ఈ కలకలం ఏమిటి?" అని ధృత రాష్ట్రుడు అడిగాడు.

కృష్ణుడు ధృతరాష్ట్రుడికి కూడా దివ్య దృష్టి ఇచ్చాడు.





# శివలీలలు

## 4

బదరికాశ్రమంలో దూర్వాసుడు తపస్సు చేసుకుంటూ ఉండేవాడు. ఒకనాటి మధ్యాహ్నం ఆయన దేవతార్చన చేసి, హవిశ్శేషాలను తన ఆశ్రమం ముందు లేడిపిల్లలకు తినిపిస్తూండగా, తుంబురుడనే ప్రమధుడు ఆకాశమార్గాన తన భార్యతో సహా పోతూ చూసి, లేడిపిల్లల కేసి చిటికెలు వేశాడు. అవి బెదిరి పారిపోయాయి. అసలే కోపిష్ఠి అయిన దూర్వాసుడు తుంబురుణ్ణి మనిషిజన్మ ఎత్తమని శపించాడు.

తుంబురుడు భయపడి విమానం దిగి, "స్వామీ, మీ జింకపిల్లలను చూసి ముచ్చటపడి చిటికవేస్తే అదినాకు శాపమై చుట్టుకున్నది. మీ శాపం అమోఘం గనక అలాగే మనిషిజన్మ ఎత్తుతాను. కాని ఆ జన్మలో శివభక్తి ఉండేటట్టు అనుగ్రహించండి," అన్నాడు. దూర్వాసుడు అలాగే అనుగ్రహించాడు.

దూర్వాసుడి శాపం ఫలితంగా తుంబురుడు కాంచీపురంలో వైశ్యుల యింట చిరుతొండడు అనే పేరుతో పుట్టాడు. అతని భార్య కూడా తిరువెంగనాంచి అనే పేరుతో పుట్టి చిరుతొండడికి భార్య అయింది. వారికి సిరియాలుడు అనే కొడుకు కలిగాడు.

చిరుతొండడు వీరశైవాచారపరాయణుడై ఏకామ్రనాధుణ్ణి అర్చించుతూ, శివభక్తులు ఏవేళ ఏ పదార్థం కోరినా శక్తివంచన లేకుండా ఇస్తూండేవాడు.

ఒకనాడు అతని ఇంటికి ఒక శివభక్తుడు వచ్చి, చిరుతొండడిని ఆశీర్వదించి, అతని నుంచి అర్చనలు పొంది, "నాయనా, నిత్యమూ శివుణ్ణి చెరుకురసంతో అభిషేకించటం నా వ్రతం. అందుచేత చేతితో

అట్ట చివరి బొమ్మ



గానుగ ఆడిన చెరుకురసం నాకు తూమెడు కావాలి." అన్నాడు.

చిరుతొండడు పరమానందం చెంది, డబ్బు తీసుకుని చెరుకు గడలు కొనటానికి బయలుదేరి వెళ్లాడు.

తూమెడు రసం కోసం నూరు చెరుకు గడలు కావాలి. అందుచేత చిరుతొండడు నూరు చెరుకుగడలు కొని కట్టకట్టించాడు. కాని అంతపెద్ద మోపు ఎత్తటం అతనికి సాధ్యం కాలేదు. అప్పుడు శివుడే మనిషి రూపంతో వచ్చి ఆ మోపును తాను కూడా మోసుకొచ్చి అంతలోనే మాయమయాడు.

చిరుతొండడు అది చూసి ఆశ్చర్యపడి, తన చేత్తోనే చెరుకుగడలను గానుగ ఆడి, తూమెడు రసం తీసి, అతిథికి ఇచ్చాడు. శివుడికి అభిషేకం జరిగిపోయింది.

కైలాసం మీద పార్వతి శివుడి శరీర మంతా చెమటతో తడిసి ఉండటం చూసి కారణం అడిగింది. శివుడు ఆమెకు చిరు తొండడి సంగతి చెప్పి, "నా భక్తుడు చెరుకు గడల మోపు ఎత్తలేక పోయేసరికి నేను సహాయం చేశాను. అతనికీ చెమటపట్టింది, నాకూ పట్టింది," అన్నాడు. ఆ వీరశైవుణ్ణి తాను కూడా చూడాలని పార్వతి కోరింది.

అప్పుడు శివుడు ఇంద్రుడితో కాంచీ పురం ప్రాంతాలలో ఎడతెగని వానలు కురి పించ మన్నాడు. కాంచీపురంలో ఇరవై ఒక్క రోజు ఎడతెగని వర్షం కురిసి, ఇరవై రెండో రోజున వెలిసింది. ఈ మూడు వారాలూ చిరుతొండడు శివభక్తులకు రాత్రిం బగళ్లు భోజనాలు పెడుతూనే వచ్చాడు. వంటచెరుకు లేకపోతే గుడ్డలు నూనెలో తడిపి అంటించి, వంటలు చేయిం చాడు, అంతేగాని ఆ గడ్డురోజులలో తన వ్రతానికి భంగం రానియ్యలేదు.

కాని తీరా వాన వెలిసిన రోజున చిరు తొండడి ఇంట అతిథి లేకుండా పోయాడు. కనీసం ఒక శివభక్తుడికైనా భోజనం పెట్టి గాని చిరుతొండడు భోజనం చెయ్యడు. అది అతని నియమం. అతను మధ్యాహ్నం వేళ బయటికి వచ్చి చూశాడు. పంచ అరు

గుల మీద ఒక్క శివయోగి కూడా లేడు. అందుచేత చిరుతొండడు అతిథుల కోసం వెతుకుతూ వీధుల వెంటపడ్డాడు. కోట ఆవరణలో ఎక్కడా ఒక శివభక్తుడు దొరక లేదు. చిరుతొండడు కోట దాటి బాహ్య ప్రదేశాలలో వెదకసాగాడు.

ఒక తోటకు సమీపంలో ఒక పాడుపడిన గుడిలో ఇద్దరు వృద్ధ దంపతులు అతనికి కనిపించారు. ముసలివాడి జుట్టు నెరిసి జడలుకట్టి ఉన్నది; ముఖాన విభూతిరేఖ లున్నాయి. ముసలావిడ గుడ్డిది; పులి చర్మం మీద పడుకుని ఉన్న ముసలాయన పాదాలు ఒత్తుతున్నది.

చిరుతొండడు వారికి చేతులెత్తి నమస్కారం చేసి, "ఇవాళ మీ రిద్దరూ మా యింటికి వచ్చి శివార్చన చేసి, నన్ను కృతార్థుణ్ణి చెయ్యండి," అన్నాడు.

దానికి ఆ వృద్ధుడు, "ఏడాదిగా నేను శివుణ్ణి ఉద్దేశించి నిరాహార వ్రతం చేస్తున్నాను. ఆ వ్రతానికి ఉద్యాపన నర మాంసంతోగాని కాదు. నరపశువు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యకులాలలో దేనికైనా చెందిన వాడు కావాలి; చిన్న వయసు వాడూ, ఆరోగ్యవంతుడూ కావాలి. వాణ్ణి తల్లి తండ్రులు చంపి, వండి, వడ్డించాలి. నువు కూడా నా పంక్తిన కూర్చొని తినాలి," అన్నాడు.



"నన్ను చిరుతొండనంబి అంటారు. శివభక్తుల వ్రతాలు కొనసాగించటమే నా వ్రతం. తమరు కోరినట్టు భోజనం పెడతాను. మా యింటికి దయచెయ్యండి," అన్నాడు చిరుతొండడు.

"నువు ఒప్పుకుంటే చాలుతుందా? నీ భార్య కూడా నా నియమానికి ఒప్పుకోవాలి," అన్నాడు వృద్ధుడు.

చిరుతొండడు తన భార్యను ఒప్పించటానికి ఇంటికివచ్చి, తిరువెంగనాంచితో సంగతంతా చెప్పాడు.

"మన మాంసం కోసి వండిపెట్టటానికైనా మనం సిద్ధమే గద. వెంటనే వెళ్లి వారిని తీసుకురండి," అన్నదామె.

ఈ లోపల, ముసలి రూపంలో ఉన్న శివుడు వేరొక రూపంలో సిరియాలుడు చదువుకునే పాఠశాలకువెళ్ళి, ఆ కుర్ర వాడితో, "నాయనా, మీ తండ్రి దుర్మార్గుడు; నిన్ను చంపి ఎవరో జోగికి వండిపెట్ట బోతు న్నాడు. వెంటనే పారిపో." అన్నాడు.

"అయ్యా, మీరు చెప్పేది చిత్రంగా ఉన్నది. పరోపకారార్థ మిదం శరీరం అన్నారు. దధీచీ, శిబీ మొదలైనవాళ్లు అజ్ఞానులా?" అని సిరియాలుడు జవాబు చెప్పాడు.

చిరుతొండడు తిరిగి దేవాలయానికి వచ్చి, ముసలి బ్రాహ్మణుణ్ణి ఎత్తుకుని, గుడ్డి అవ్వను నడిపించు కుంటూ ఇంటికి వచ్చాడు.

తల్లి దండ్రులు సిరియాలుడికి తలంటి పోసి స్నానంచేయించి, అలంకరించి, "నాయనా, శివయోగికి ఆహారమవుతావా?" అని అడిగారు.

"సంతోషంగా అవుతాను," అన్నాడు సిరియాలుడు.

తల్లి తన కొడుకును ఒడిలో పడుకో బెట్టుకున్నది. చిరుతొండనంబి కొడుకును చంపాడు. సిరియాలుడి మాంసం వండి ఆ భార్యాభర్తలు వృద్ధ దంపతులకు వడ్డించారు. ముసలివాడు చిరుతొండనంబితో "నువ్వూ, నీ కొడుకూ నా పంక్తిన భోజనం చెయ్యండి మరి," అన్నాడు.

"మా అబ్బాయి ఎటో వెళ్లి ఉంటాడు. వంటకాలు చల్లబడతాయి. మీరు ఆరగించండి," అన్నాడు చిరుతొండడు.

"నీ భార్యను కేకపెట్టమను, పిల్లవాడు వస్తాడు," అన్నాడు ముసలివాడు.

తిరువెంగనాంచి, "నాయనా, సిరియాలా! రారా!" అని కేకపెట్టింది.

సిరియాలుడు పరిగెత్తుకుంటూ వీధిలో నుంచి లోపలికి వచ్చాడు.

చిరుతొండడు వృద్ధదంపతుల కేసి తిరిగే సరికి అతనికి పార్వతీ పరమేశ్వరులు అసలు రూపంలో కనిపించారు! వారు అతని శివభక్తికి మెచ్చుకుని, అతని పూర్వ జన్మ కథ తెలిపారు.





ప్రపంచపు వింతలు :

## 136. డిప్లోడకస్ అస్థికలు

రాకసిబల్లులు అనేక కోట్ల సంవత్సరాల క్రితం భూమి మీద చిత్తడినేలలలో సంచరించాయి. వాటిలో చాలా రకాలుండేవి. అన్నిటిలోకి పెద్దది డిప్లోడకస్. దాని బరువు ఏనుగు బరువుకు పదింతలుండేది. వాషింగ్టన్ (అమెరికా) లోని నేషనల్ మ్యూజియంలో డిప్లోడకస్ అస్థిపంజరాన్ని అమర్చారు. (బొమ్మ చూడండి) ఈ అస్థి పంజరం నిడివి **70** అడుగులు.

డిప్లోడకస్ శాకాహారి. బ్రాంటొజారస్ (ఉరుముల బల్లి) అనే రాకసిబల్లి కూడా శాకాహారే. అలోజారస్, టిరనోజారస్ అనే పేర్లు గల రాకసిబల్లులు మాంసాహారులు. అవి ప్రమాణంలో డిప్లోడకస్ కన్న చిన్నవి. రాకసిబల్లులు ఏనాడో అంతరించిపోయాయి.

Photo by Sambhu Mukherjee



బహుమతి
పొందిన వ్యాఖ్య

చీకటి వెలుగుల మధ్య

పంపినవారు :
ఎస్.వి.ఎస్. హేమామాలిని

Photo by Sambhu Mukherjee



హిమాయత్ నగర్,
హైదరాబాదు.

జీవితము ఎంతో మిథ్య

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు





★ వ్యాఖ్యలు ఏప్రిల్ నెల 20 వ తేదీలోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు జూన్ నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
"పెద్దలు"

మూడవ అట్ట:
"పిన్నలు"

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# ఆత్మరక్షణలో తొలిపాఠం




























ఫోర్‌హాన్స్
దంతవైద్యునిచే సృష్టింపబడిన టూత్‌పేస్టు

